# సనాతన సారథి

ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 23 జనవరి 1980 సంచిక 2

చిత్రము : — సచ్చిదానందమూర్తి


| | | |
|---|---|---|
| సత్యసాయివాహిని - (14) | భగావాన్ శ్రీ సత్యసాయిబాబా | 26 |
| మానసమరాళి : | అమరేంద్ర | 28 |
| వేదపురుష సప్తాహ జ్ఞానయజ్ఞము | భగవానుని దివ్యోపన్యాసము | 29 |
| 'భ్రాంతి' | భగవానుని దివ్యోపన్యాసము | 35 |
| చిత్తచోరుడు | —కాందూరి భార్గవి | 39 |
| సైన్సు, స్పిరిచ్యుయాలిటి: ఒకేకానుకి బొమ్మా బొరుసులా ? | ప్రొఫెసర్ ఎస్. వి. పప్పు | 41 |
| కాలేజి విద్యార్థులు | శ్రీవారి దివ్యబోధ | 44 |
| విగ్రహారాధన | శ్రీవారి దివ్యబోధ | 47 |


చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికి పైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు " . /-3-''80 అనియుండిన, మీ చందా మార్చి నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) ఫిబ్రవరి నెల 29 వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను

—: శ్రీ వారి కార్యక్రమములు : —

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.

వివరములకు అటలోపలి భాగములో చూడండి




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 14

విజ్ఞానము లేని విద్య, వివేకము లేని విజ్ఞానం, లౌకికము లేని మనిషి, విచక్షణ లేని పని. విజ్ఞత లేని పాండిత్యము, అర్హత లేని అధికారము, సత్యము లేని వాక్కు, మాధుర్యము లేని సంగీతం. భక్తి లేని పూజ. శీలం లేని మనిషి, వినయము లేని విద్యార్థి, సభ్యులను మెప్పించని ఉపన్యాసం రాణించదు. శ్రమ తప్ప ఫలితం శూన్యం. శాస్త్రజన్యజ్ఞానముతో బాటు ప్రతి ఒక్కరూ అనుభవజ్ఞానమును కూడా సంపాదించి తీరాలి. అనుభవంలోకి రాని విద్యావిజ్ఞానాదులవల్ల ప్రయోజనమేమియూ ఉండదు. మనలో నిలకడగా నిల్వఉన్న జ్ఞానం వృథా. అది వట్టి పాండిత్యంగా మాత్రమే నిలిచిపోతుంది. దానిని అనుభవములోనికి తీసుకొని రావటంలోనే ఉన్నది గొప్పతనము. ధనమును సంపాదించి దాచిపెట్టినందువల్ల ప్రయోజనం లేదు. దానిని అనుభవించునప్పుడు, లోక కల్యాణమునకు, సద్వినియోగము చేసినప్పుడే దాని సార్థకత.

అట్లే వివిధ పుస్తకములలోని జ్ఞానమును సంపాదించినంతమాత్రమున ప్రయోజనము లేదు. దానిని అనుభవము లోనికి తెచ్చుకొని లోకకల్యాణమునకు వినియోగించినప్పుడే దానికి కూడ సార్థకత ఉంటుంది. అయితే ఇట్టి అనుభవమును పొందు టెట్లు? దీనిని పొందుటకు మూడుదశలను దాటవలసి ఉంటుంది. మొదటిది తెలుసుకొనుట, రెండవది చూచుట, మూడవది ప్రవేశించుట. వీటినే 'జ్ఞాతుం,' 'ద్రష్టుం.' 'ప్రవేష్టుం' అని అందురు.

మొట్టమొదట శాస్త్రములోనున్న అమూల్యమైన విషయాలను గురించి అనుభవజ్ఞులద్వారా తెల్లుసుకొనవలెను. తెలుసుకొనుటవలన వాటియందు సహజముగా అసక్తి జనిస్తుంది. అపుడు వాటిని యెట్లయినా సరే చూచితీరాలి. అనే కోరిక పుడుతుంది. దీనినే 'జ్ఞాతుం' అని అంటారు.

రెండవదశలో అటువంటి శాస్త్రములు. విశేషములు ఎక్కడెక్కడ ఉన్నాయో పరిశీలన చేసి, చూచి, సేకరిస్తాము. ప్రత్యక్షంగా చూస్తాము. చదువుతాము. ఎంతో పట్టుదలతో విచారిస్తాము. అవగాహన చేసుకొంటాం; ఆనందిస్తాము. అంతటితో కొంతవరకు తృప్తి కలుగుతుంది. కొన్ని అమూల్యమైన విషయాలను తెలుసుకొన్నామనే సంతృప్తి కలుగుతుంది. శాస్త్రజ్ఞానం లభిస్తుంది, ఇట్టి దశను 'ద్రష్టుం' అంటారు.

పై రెండు దశలలో సంతృప్తి చెందితే ప్రయోజనము లేదు; ఉండదు. దానిలో ప్రవేశించి లీనమై తాదాత్మ్యం పొందవలెను. దానిలో అనగా తెలుసు కొన్నదానిలో చూచినదానిలో లీనమై అనుభవించాలి. అన్నం తిని సోమరిలా ఏ పనీ చేయకుండా వూరకనే పండుకుంటే ఉపయోగం లేకపోగా అజీర్ణం చేస్తుంది. ప్రతి రోజు సరిపోయే ఆహారము తీసుకొని శారీరకశ్రమచేసినప్పుడే తిన్న తిండి జీర్ణమై రక్తరూపమై మానవునికి శక్తినిచ్చును. అదేవిధంగా తెలుసుకొని చూచిన విషయాలను జీర్ణము చేసుకొని అనుభవములోనికి అనగా అచరణలోనికి తెచ్చుకొని మానవకల్యాణానికి. దేశపురోభివృద్ధికి ఉపయోగించినప్పుడే తెలుసుకొని చూచినందువల్లా ప్రయోజనము ఉంటుంది. పుస్తకములో నున్న విషయములను కంఠస్థము చేసి ఉపన్యాసధోరణిలో చెప్పడం కొంత తేలికే. సాధారణంగా పుస్తకపఠనముద్వారా కలిగెడు జ్ఞానం పుస్తకజన్యజ్ఞానము అందురు. ఇది సర్వసామాన్యమైనది. కనుక విన్నవి, కన్నవి, తిన్నవి కొంత వరకైనా ఆచరణరూపం చెందాలి. అనుభవములోనికి తీసుకొనిరావాలి. దీనినే 'ప్రవేష్టుం' అని అందురు.

మన ప్రాచీన శాస్త్రములలో అనేక అమూల్యవిషయాలున్నవి. విలువైన రత్నములు దాగి ఉన్నవి. సాంకేతిక అణుసిద్ధాంత రహస్యములుకూడా ఎన్నో ఉన్నవి. అన్వేషణ ప్రారంభించాలి. మానవవికాసానికి ఉపయోగపడేటట్లు చేయాలి. ప్రతివిద్యార్థిలో నూతనవిషయాలను కనిపెట్టాలనే తాపత్రయం. పట్టుదల తప్పని సరిగా ఉండాలి. మహోపన్యాసములివ్వడంతో, చర్చావేదికల నలంకరించడంతో సంతృప్తి చెందరాదు. 'విచారణ జరిపి నూతన విషయాలను కనిపెట్టాలి', అనే కుతూహలం ఉండాలి. అటువంటి వారు మాత్రమే విజ్ఞానమును లోకానికి అందించకలుగుతారు. పైపై జ్ఞానమువలన ప్రయోజనముండదు. అనుభవజ్ఞానమునకు మించిన జ్ఞానము మరొకటి ఉండదు. కనుక అటువంటి అనుభవజ్ఞానమును స్వశక్తితో, స్వప్రేరణతో, స్వయంకృషితో. పట్టుదల శ్రద్ధలతో సాధించి సాంకేతిక పురోభివృద్ధికి తోడ్పడి, అధికోత్పత్తినిచేసి, దేశపురోభివృద్ధికి ఉపయోగ పడాలి.

అనుభవజ్ఞానమును సంపాదించటం ఎంత అవసరమో దానిని మంచికి, దేశకల్యాణమునకు ఉపయోగించే వివేకజ్ఞానముకూడ అంత అవసరము. వివేకములేని విద్యవల్ల విచక్షణ చూపించలేని జ్ఞానమువల్ల ఉపయోగమేమాత్రము ఉండదు. వివేకము వేరు; విద్య వేరు. మంచికి చెడుకు మధ్య వ్యత్యాసం తెలుసుకొనుటే వివేక లక్షణము. అట్టి వ్యత్యాసమును తెలుసుకొనిన పిదప దీనికి ఎంత, ఎప్పుడు ఎటువంటి ప్రాముఖ్యము నివ్వాలో నిర్ణయించగల శక్తిసామర్థ్యములనే 'విచక్షణా జ్ఞానం' అని అంటారు.

విచక్షణాజ్ఞానం వివేకజ్ఞానములోని అంతర్భాగం. వివేకము లేని వానికి సన్మార్గం పట్టుబడదు. మనము చేయు ప్రతిపనిలోను వివేకాన్ని ప్రదర్శించటం విజ్ఞతలక్షణం. అణు పరిశోధనలను జరిపి ఒక్క క్షణంలో ప్రపంచాన్ని భస్మీపటలం చేయగల మారణాయుధాలను తయారుచేయవచ్చును. అదే అణుశక్తిద్వారా కొన్ని కోట్ల కిలోవాట్ల శక్తిగల విద్యుచ్ఛక్తిని తయారు చేయవచ్చును. దానిని పరిశ్రమలకు వ్యవసాయములకు అనుకూల పరచి దేశమును సస్యశ్యామలంగాకూడా చేయవచ్చును. విద్యావంతుడు ఇటువంటి విషయములలోనే తన వివేకబుద్ధిని ప్రదర్శించాలి. విచక్షణాజ్ఞానాన్ని చూపించాలి. తాను కనిపెట్టిన గొప్పవిషయాన్ని చెడుకు, సంక్షోభానికి, సర్వనాశనానికి కాక, మంచికి, మానవ కల్యాణానికి, అధికోత్పత్తికి ఉపయోగపడే విధముగా చేయడమే వివేకజ్ఞానం అని అంటారు.

ఇట్టి వివేకవిచక్షణాజ్ఞానం, కలవారు ఒక వేళ ధనహీనుడైననూ అధికారం లేనివాడైననూ అందరిచేతనూ గౌరవింపబడుతాడు; పూజింపబడుతాడు. వివేకవిచక్షణాజ్ఞానము లేనివాడు, విద్యావేత్త అయిననూ, మిక్కిలి ధనవంతుడైననూ ప్రముఖశాస్త్రవేత్త అయిననూ, ఏమాత్రము ప్రకాశించడు. వివేకవిచక్షణాజ్ఞానరహితుడు ధర్మమేదో, అధర్మమేదోకూడ కనుగొనలేడు. అందువలన ఒక శాస్త్రజ్ఞానంతోనే సంతృప్తిచెందక వివేకవిచక్షణాజ్ఞానములను మరియు అనుభవజ్ఞానమును ప్రతివిద్యార్థి సంపాదించితీరవలెను. వివేకముతోకూడిన దూరదృష్టిని అభివృద్ధి పరచుకొనవలెను. దానిని సమాజాభివృద్ధికి వినియోగించవలెను.

అనుభవజ్ఞానవివేకజ్ఞానములతోనే సంతృప్తి చెందరాదు. ప్రతివానికి లౌకికజ్ఞానము కూడా కావాలి. దీనినేప్రపంచజ్ఞానం అంటారు. ఈ జ్ఞానం కేవలము పుస్తకాలద్వారా లభ్యము కాదు. దీనిని సంపాదించుకొనవలెనన్న లేక పొందవలెనను ఆసక్తియున్న విస్తృతంగా దేశాటన చేయవలెను. దానికే పూర్వీకులు తీర్థయాత్రలు, మహనీయుల దర్శన, స్పర్శన సంభాషణలను పొందగోరి, పవిత్రక్షేత్రదర్శనములు చేయుచూ వచ్చిరి. అంతేకాదు. ప్రపంచములో దైవసృష్టిలోని వింతలు, వినోదములు దర్శించి వాటివలన అనేక విధములైన జ్ఞానమును సంపాదించుకొనెడి వారు. ప్రకృతిలో పలువిధములైన జ్ఞానమును ప్రబోధించే అమూల్యమైన విషయాలెన్నియో యున్నవి. ప్రతివాటి పుట్టుపూర్వోత్తరాలను తెలుసుకొనవలెను. చరిత్రను నాగరికతను, సంస్కృతిని అవగాహనచేసుకొని ప్రచారములోనికి తీసుకొనిరావలెను. ఈ విధమైన ప్రచారానికి పూనుకొనగోరు వ్యక్తి మొట్ట

మొదట ఆత్మజ్ఞానతత్త్వమును అర్థము చేసుకొన వలెను. లోకములో భౌతికజ్ఞానం, సంగీత జ్ఞానం, సాహిత్యజ్ఞానం శిల్ప గణిత శాస్త్రజ్ఞానము ఇత్యాది జ్ఞానములెన్నో ఉన్నవి. అన్నింటి యందు ఆత్మజ్ఞానం రాజువంటిది. అది తెలియక శాంతిలేదు.

ప్రపంచదృష్టిలో కీర్తిప్రతిష్ఠలు సంపాదించిన ప్పటికీ ఆత్మజ్ఞానము సంపాదించనివానికి సుఖ ముండదు. అన్ని విధములైన జ్ఞానములలో కెల్లా ఆత్మజ్ఞానము శ్రేష్ఠమయినది. ఆత్మజ్ఞాన మన్నా, పరమాత్మజ్ఞానమన్నా, ఆధ్యాత్మికజ్ఞాన మన్నా అంతా ఒక్కటే. ఆత్మను, పరమాత్మను చక్కగా తెలుసుకొనుటకు దోహదంచేసే జ్ఞానం దేనిని తెలుసుకొనినచో సమసము తెలుసుకొనబడినదగునో అట్టి పరమాత్మను ఎరిగిన వాడగును. అదియే ఆత్మజ్ఞానము. అతడే ప్రపంచములో సర్వజ్ఞునిగా పేరు ప్రఖ్యాతులను పొందుతాడు. లౌకికవిద్యలు పరిపూర్ణశాంతిని కలుగజేయజాలవు. ఆత్మజ్ఞాని ఒక్కడు మాత్రమే శోకమును దాటగలడు. కనుక ప్రతిఒక్కరు ఆత్మజ్ఞానవిషయమును తెలుసుకొనుటకు ప్రయత్నించవలసియుండును. ఆత్మజ్ఞానము చిత్తశుద్ధి వలననే కలుగును. అట్టి చిత్తశుద్ధి పవిత్రకార్యములు, పుణ్యకార్యములు, అనగా దానం, పరోపకారం, భూతదయ. దైవ భక్తి, నిష్కామ బుద్ధితో ఎట్టి ఫలాపేక్ష లేకుండా, ఈశ్వరార్పణబుద్ధితో కర్మల నాచరించడమువలన జరుగుతుంది. అట్టి నిర్మలహృదయమున జ్ఞానభాస్కరుడు ఉదయిస్తాడు. అట్టి జ్ఞానోదయము వలన నరుడు నారాయణుడు అవుతాడు.

(సశేషము)

## మానసమరా

ఎటనుండి నీరాక ఏడకే నీపోక
ఇట నీవు విహరించువేడుకలు ఎందాక?
ఇది దక్షిణాయణము కదలుమిచ్చటినుంచి
భీకరంబగు మృత్యుతమనమ్ములనువీడి
అదె ఉత్తరాపథము పరమశివసదనమ్ము
కైలాస శిఖరాగ్ర కైవల్యధామమ్ము
నిండె మానస సరసి నిర్మలానందఝరి
నీ నీడ నీవరసి మురిసిపొమ్మొకసారి
నీదు గమ్యములోని హర్మ్యమని గురుతించి
నీకు దారిచూపు రవిబింబమునుగాంచి
నీడివచ్చిన గూటిజాడలను గమనించి
వినువీథిసాగవే నా మానసమరాళి!
వెనుదిరిగి చూడకే కాంతిమధువుల గ్రోలి.
ఎండ మిలమిలలోన వెండిరెక్కలువంచి
చిరుగాలి కెరటాల తెరచాప సవరించి
చిన్నారి నావపై దివ్య సీమవరించి
ఎగసిపో సొగసుగా నా మానస మరాళి!

అమరేంద్ర

# వేదపురుష సప్తాహ జ్ఞానయజ్ఞము

ఏ గుణంబు గణించి - ఏతెంచెనో నాడు
ప్రహ్లాదు పాలింప - పరమపురుషు
డేగుణంబు గణించి - ఏతెంచెనో నాడు
కరిని గాచెడి తరి - కమలనయను
డేగుణంబు గణించి - ఏతెంచెనో నాడు
ధ్రువకుమారుని సాక - రూఢిమీఱ
నేగుణంబు గణించి - ఏతెంచెనో నాడు
బలిచక్రవర్తిగా - వంగనోర్చి
ఆగుణంబె గణించి యా - యమరవంద్యు
డార్త జనులను బాలించు - నట్టివాడు
శ్రీనివాసుండు లోకైక - చిన్మయుండు
వెల్లెపర్తీశుడై నేడు - పృథివియందు.

మౌళి గుల్కెడు చంద్ర - మఃఖండకళతోడ
బెడగారు గుంపెడు - జడలతోడ
జడలలో ప్రవహించు - జడలేటి బిగితోడ
డంబైన ఫాలనే - త్రంబుతోడ
నల్ల నేరెడువంటి - నల్లని మెడతోడ
కరమున నాగకం - కణముతోడ
నడుమున చుట్టిన - నాగచర్మముతోడ
మైనిండ నలదు భ - స్మంబుతోడ
ఆఱు శాస్త్రములందున - నందగించి,
నల్ల కలువల హపియించి - కొల్లలాడు.
మెరుగు చామన ఛాయల - మేనితోప్ర
శాంతివాసుడు నేడు సా - క్షాత్కరించె.

దేహము పాంచభౌతికము - దేహము కూలక తప్పదెప్పుడున్
దేహి నిరామయుండు గణు - తింపగ దేహికి చావుపుట్టుకల్
మోహనిబద్ధబంధనల - ముద్రలు లేవు నిజంబు జూడ, నా
దేహియె దేవదేవుడుమ - దిన్ గమనింపగ నాత్మరూపుడై.

ప్రేమస్వరూపులారా!

దేహము ఎవరిది? కన్న తల్లిదా? పోషించిన తండ్రిదా? లేక తల్లిని కన్న తాతదా? ఎవరిదీకాదు. ఇది కేవలము జడమైనటువంటి, మృణ్మయమైన ఘటము. ఇట్టి మృణ్మయమైన దేహమును నేనుగా భావించి సత్యమైన ఆత్మతత్త్వాన్ని మనము ఈ నాడు మరచుచున్నాము. నీవు దేహము కాదు; దేహివి. నీవు శరీరము కాదు శరీరివి; నీవు క్షేత్రము కాదు; క్షేత్రజ్ఞుడవు. ఇట్టి నిత్యమైన ఆత్మను, సత్యమైన దేహిని పవిత్రమైన క్షేత్రమును అపవిత్రము గావించుకొనే కర్మలయందు మనము ఈ నాడు మన జీవితమును అంకితం గావించుకొనుచున్నాము. మానవుడికి సంభవించు సర్వవిధములైన దుఃఖములు కూడ నూ దేహాభిమానము చేతనే కలుగుచున్నవి. ఈ తుచ్ఛమైన నీటిబుడగవంటి దేహమునే నేనని భావించి, ఈ మమత్వము చేతనూ, అభిమానము చేతనూ దుఃఖమునకు కట్టుబడుతున్నాడు మానవుడు. ఇది కేవలము జడమైనటువంటిదన్న సత్యాన్ని తాను గుర్తించుకోలేక పోతున్నాడు.

అయితే, ఈ ఆత్మను ఆధారంగా చేసుకుని, ఆదే

యమనే దేహమునందు, జగత్తును అనుభవించుటకు కొన్ని విధములైన కారణములు కల్పించినాడు భగవంతుడు. రథము, రథమునిమిత్తమై ఏర్పడలేదు. 'కారు' 'కారు' నిమిత్తమై కల్పించినది కాదు. కారులో ప్రయాణం చేసే అధికారి ఒకడున్నాడనే సత్యాన్ని మనం గుర్తించాలి. కనుకనే ఈ దేహి, దేహమనే రథమును ఆధారం చేసుకుని జగత్కల్యాణనిమిత్తమై, ధర్మాచరణనిమిత్తమై, సత్యాన్వేషణ నిమిత్తమై, సర్వాన్వేషణనిమిత్తమై కొంతవరకు ప్రయాణం సలుపుతూ వస్తున్నాడు. నిజముగా మానవజన్మము, ఈ శరీర ధారియైన జీవుడు, పవిత్రమైన దివ్యత్వాన్ని పొందే నిమిత్తమై తానీ జగత్తుకు దిగివచ్చాడు. మన జీవితమంతయూ యజ్ఞరూపకంగా వచ్చింది. మనము ఏ కర్మలు చేసినప్పటికినీ, ఏ క్రియలు ఆచరించినప్పటికినీ, యజ్ఞముగానే రూపొందుతూ వస్తున్నవి. అహంకారరహితమైన కర్మ, స్వార్థరహితమైన కర్మ కేవలము ఫలాపేక్షలేనటువంటి కర్మ, యజ్ఞస్వరూపాన్ని ధరిస్తూంటుంది. దీనినే కర్మయోగము అని పిలుస్తూ వచ్చింది భగవద్గీత.

ఈనాడు ఏడుదినములనుండి గావించుచున్న వేద పురుషసప్తాహజ్ఞానయజ్ఞము సమాప్తి గావింపబడినది. సమాప్తియనగా బ్రహ్మప్రాప్తియే! ఈ యజ్ఞమునందు ప్రాతఃకాలమున, సాయంసమయములయందు, ఇంద్రుడిని ఆహ్వానించడము, ఇంద్రునికి నైవేద్యము పెట్టడము, ఇంద్రునితోపాటు అనేకదేవతలనుకూడా ఆహ్వానించడము జరుగుతూవచ్చింది. ఇక్కడ ఇంద్రుడనగా ఎవరు? ఇంద్రుడనగా ఏదో ఒక ప్రత్యేకమైన స్వరూపాన్ని ధరించిన వ్యక్తి కాదు. మానవుని దేహమునందున్న ఇంద్రియములకు అధిపతి యగువాడే ఇంద్రుడు. ఈ ఇంద్రునకే మనస్సు అని మరొక పేరు. ఈ మనస్సు ఇంద్రియములచేత అనుభవింపబడినంతకాలమూ దీనికి ఇంద్రుడు అని పేరు వచ్చింది. ఇంద్రియములను దమించడంచేత ఇంద్రుడికి రుద్రుడు అని మరొక పేరు పెడుతూ వచ్చారు. ఇంద్రుడు కానీ, రుద్రుడు కానీ, వేరు కాదు. ఇంద్రియములను నిగ్రహించినవాడే రుద్రుడు. ఈ ఇంద్రునకు ఒక చక్రము కలదు అని కూడా వేదము నందు చెప్పబడుతూ వచ్చింది. ఈ చక్రమునకు అనేక విధములైన పేర్లు కలవు.

శతారము అనగా పది అంచులు కలిగినది. వెయ్యి కళ్ళు, అంచులు కలిగినది ఈ చక్రము. అని గూడ మరొక పేరు గలదు. కనుక శతారము, సహస్రారము, దశారము అని దీనికి మూడు పేర్లు పెడుతూ వచ్చారు. ఆరము అనగా అంచులు. కనుక పది అంచులు కలిగినది ఇంద్రునియొక్క చక్రము అని దీని అర్థము. ఈ పది అంచులు ఏవి? ఐదు కర్మేంద్రియములు. ఐదు జ్ఞానేంద్రియములు. కనుక ఈ దశేంద్రియ స్వరూపమైన ఈ గుణములనే ఇంద్రుడు చక్రముగా ధరిస్తూవచ్చాడు. ఈ పదింటికినీ అధిపతి అయినవాడు మనస్సు. కనుక ఇతనికి ఏకాదశరుద్రుడు, అని మరొక పేరు పెడుతూవచ్చారు. ఏకాదశరుద్రుడనగా ప్రత్యేకించినటువంటి వాడు కాదు. మన ఇంద్రియములు, ఇంద్రియములకు అధిపతి అయిన మనస్సు; ఈ రెండింటి సమ్మిళితమే ఏకాదశ స్వరూపము. ఇక్కడ ఇంద్రుడిని అనేకవిధములుగా ఆహ్వానము సలుపుతూవస్తుంటారు.

ఈ ఇంద్రునే వేదమునందు 'పురుహూతుడు' అన్నారు. ఈ పురుహూతుని అంతరార్థము:- 'పురు' అనగా మాటిమాటికి: 'హూతుడు' అనగా పిలువబడువాడు అని, అనగా ఆహ్వానింపబడువాడు. కనుక మన

స్సును పరిపరివిధములుగా ఆహ్వానం సలుపుతూ ఉండటమే పురుహూతుని అర్థము. ఈ పురుహూతుని తత్త్వములో మనం అంతరార్థాన్నికూడ, కొంత గుర్తించాలి. జాగ్రత్స్వప్నసుషుప్తులయందు అప్పుడప్పుడు మనస్సునుకూడా మనం కొంత మరచి ఉంటున్నాము. ఈ మనస్సు ఉద్రేకముగా నుండే సమయమునందు, దీనిని అరికట్టడానికి ఇంద్రుడిని అప్పుడప్పుడు మనం ఆహ్వానించవలసి ఉంటుంది. కనుక ఈ ఇంద్రుడిని ప్రతిమానవుడు కూడా, ప్రతినిత్యం కొన్ని పర్యాయములైనా ఆహ్వానిస్తూవస్తున్నాడు.

మనస్తత్త్వకర్తవ్యమేమన నిరంతరము ఇంద్రియములను అనుభవించుటయే! దీనిని అరికట్టడానికి ప్రయత్నించినప్పుడే పవిత్రమైన సార్థకనామము ఇంద్రత్వము, దీనికి కలుగుతుంది. కనుక ఇంద్రియనిగ్రహమనేది ప్రధానమైన యజ్ఞము. మనకు ఇష్టమొచ్చినట్లుగా సంచరింప చేయుట ఇంద్రియములయొక్క కర్తవ్యం కాదు. ఇంద్రియములను సక్రమమార్గమున సంచరింపజేసి మానసిక తత్త్వాన్నుంచి, ఇంద్రత్వానికి పోవు ప్రయత్నానికి మనం పూనుకోవాలి. ఈ మనస్తత్త్వము అనేక విధములుగా కోపతాపములచే ఉద్రేకపడి మానవత్వాన్ని మరచిపోతూ ఉంటుంది. ఇలాంటి దుర్గుణములను మనస్సు అనే బలిపీఠముపైపెట్టి ఆత్మార్పణము గావించుకునే నిమిత్తమై ఇంద్రియనిగ్రహమను ఒక మార్గాన్ని అవలంబిస్తూవచ్చారు. మనము చేయవలసినది దుర్గుణములను, దురాలోచనలను, దుస్సంగములను, దుష్టత్వములను, ఈ యజ్ఞబలిపీఠమునసుంచి బలిగావించాలి. ఈ పశుగుణములను ఎప్పుడు మనము ఈ యజ్ఞపీఠము నందుంచి భగవంతునికి ఆహుతి చేయుదుమో అదే నిజమగు యజ్ఞస్వరూపము.

కనుక ఈ నాడు ఈ మృగతత్త్వములను, ఈ పశుగుణములను బలిచేసి, పూర్ణముగావించుకుని మనస్తత్త్వములో పూర్ణత్వాన్ని అనుభవించిన దినము. విత్తనమును మట్టిలో పెట్టినప్పుడు మొక్కగావచ్చి, వృక్షముగా తయారై శోభాయమానమైన ఫలపుష్పాలతో నిండినట్లుగా, మానవుడు పుట్టి, పెరిగి, పరిణామమునొంది, పరిపూర్ణుడు కావాలి. కనుక మానవుడు కూడ, మట్టిలో పుట్టిన ప్రాను వంటివాడే. ఈ మట్టి ముద్దను చూసి మనిషిగా భావించుకోవడమే పెద్ద అజ్ఞానము ఈ మృణ్మయఘటమును చూసి చిన్మయంగా భావించుకోవడమే అజ్ఞానముయొక్క రెండవ లక్షణం. కనుకనే ఈ దేహమును సార్థకము గావించుకునే నిమిత్తమై దేహిని అన్వేషించే ప్రయత్నమును మనం చేయాలి. ఈ నాటినుండి మనయందున్న పశుగుణములను, పశుభావములను నిర్మూలం గావించుకునే ప్రయత్నము మనం సలుపాలి. ఈ విధమైన ప్రయత్నమునకు పూనుకొన్నప్పుడే మనం యజ్ఞయాగాదిక్రతువులు చేసినందుకుగానీ, చూచినందుకుగానీ, ఫలితము కొంత లభిస్తుంది. ఎంతకాలమైనప్పటికినీ, ఎన్ని సంవత్సరములు జరిగినప్పటికినీ, మన సాధనలు ముందంజవేయక, ఉన్నస్థానమునందే ఉండి, కేవలము ఒకవిధమైన తామసత్వముచేత మనము కాలమును వ్యర్థము గావించరాదు. క్రమక్రమేణా మనదృష్టిని అంతర్ముఖముగావించుకొని, బహిర్దృష్టిని కొంతవరకు అణగద్రొక్కుకుని, సరియగు మార్గాన్ని అవలంబించడానికి మనం కొంతవరకు పూనుకోవాలి.

ప్రశాంతినిలయమునందుకూడా, ఈ విధమైన సాధనలు అభివృద్ధిగావించే నిమిత్తమై కొంతవరకు ఆదర్శవంతమైన జీవితమును అనుసరింపజేసేనిమిత్తమై, బహిర్ముఖమైన కర్మకలాపములు క్రమక్రమేణా తగ్గించడానికి ప్రయత్నిస్తున్నాను. పూజలు, భజనలు,

జపములు, తపములు సలిపినప్పటికినీ మన దృష్టిని చిత్తమునందుంచుకుని, పరిశుద్ధ భావముచేత క్రమక్రమేణా ఈ బ్రాహ్యమైన అలవాట్లను మనం కొంతవరకు తగ్గించుకుంటూ రావాలి. ఆధారాధేయములను మనం తెలుసుకునేంతవరకు ఈ విధమైన బాహ్యకర్మలు అత్యవసరమే. అయితే ఆధేయమును జీవితమంతా అనుభవించడానికి వీలుకాదు. ఆధారమును గుర్తించేదే దీని లక్ష్యము. కనుక పైపై జపములుకానీ, పైపై ధ్యానములు కానీ, పైపై భజనలుగానీ ఎంతకాలము మనము చేసినప్పటికీ ఇవి కేవలము కాలమును వ్యర్థము గావించుకునే కర్మలుగానే రూపొందుతాయి. మనము నిదర్శనస్వరూపులమేగానీ, ప్రదర్శన స్వరూపులము కాదు. పదిమంది మెచ్చుకునే నిమిత్తముగానీ, పదిమంది ఒప్పుకునే నిమిత్తముగానీ, పదిమందికి ఆదర్శంగా నిలవాలనిగానీ, మనం ఈ బాహ్యకర్మలనాచరించుటలేదు. కొంతవరకు ఈ బాహ్యకర్మలను అణగద్రొక్కుకోవడానికే మనం ప్రయత్నం చేయాలి. పైపై ఆచరణల వల్లనే, పైపై మాటలవల్లనే, పైపై క్రియలవల్లనే భారతదేశములో నాస్తికత్వమనేది బలపడుచున్నది. మనం చేసే ప్రతిక్రియయందూ, అంతరార్థాన్ని గుర్తించాలి. ఆపదమునుగూడ సమన్వయం గావించాలి. మనం ఏమి చెపుతున్నాము, ఏమి చేయుచున్నామని, దీని యొక్క అర్థం ఏమిటనికూడా మనం గుర్తించడం లేదు. అర్థంతెలియనటువంటి కర్మలలో కాలాన్ని వ్యర్థం గావించుతున్నాము. ఒక గంటకు పూర్వము మీరు విని ఉంటారు. 'ఆత్మాయ నమః', 'ఆత్మలింగా యనమః' అని వేదాధ్యయనము చేసేవారు చెపుతూ వచ్చారు. అయితే 'ఆత్మా య నమః' అన్నది కరెక్టా? లేక 'ఆత్మాయ నమః' అన్నది కరెక్టా? ఆత్మాయ నమః అని చెప్పాలి. కానీ, దీని యొక్క తత్త్వము మనము గుర్తించుకోలేదు కనుకనే, 'ఆత్మా యనమః', 'ఆత్మలింగా యనమః' అనువిధముగా విభాగము చేయడం చేతనే దీనియొక్క అర్థమును కూడా వ్యర్థం గావించుతున్నాము.

కనుకనే భారతదేశము నందు పవిత్రమైన వేదములు సార్థకము గావించుకునేనిమిత్తమై అర్థమును కూడా గుర్తించడం అత్యవసరం. వేదముయొక్క సారమే భగవత్స్వరూపమని, మనము అనేకపర్యాయములు వింటున్నాము. కానీ, మనము అట్టివేదమును పవిత్రముగావించుకునేమార్గములో దానిని ప్రవేశపెట్టాలి. ఏది తెలిసినప్పటికినీ, మనోవాక్కాయ కర్మలతో దానిని ఆచరించడానికి ప్రయత్నించాలి. దీనినే త్రికరణశుద్ధి అని చెపుతూ వచ్చారు. మన వాక్కును కానీ, మనకాయమును కానీ, మన మనస్సును కానీ, పవిత్రముగావించుకునే ప్రయత్నములో మన సాధనలు సల్పాలి. మాటలచేత ఇతరుల హృదయాలను ఏమాత్రముగాయపరచ కూడదు. దేహముతో ఇతరులను బాధించకూడదు. మనస్సున ఇతరులకు ద్రోహము తలంచరాదు. ఈ విధమైన కర్మలను మనము సార్థకము గావించుకున్నదినమే యజ్ఞయాగాదిక్రతువులను ఆచరించిన ఫలితాన్ని అందుకుంటాము.

ముఖ్యంగా ఈనాడు లోకంలో వాక్కుచేత ఇతరుల హృదయాన్ని బాధించడమనేది అమితంగా జరుగుతున్నది నాలుకచాలా పవిత్రమైనది కంటికి ఒక శక్తి మాత్రమే ఉన్నది. అది కేవలము చూడగలదు. చెవికి ఒక శక్తిమాత్రమే ఉంటున్నది. అది కేవలం వినగలదు. కానీ నాలుకకుమాత్రం రెండు శక్తులు ఉంటున్నాయి. ఒకటి మాటలు, రెండవది రుచి. కనుక మాటలను పవిత్రమైన రీతిగా మనం ప్రవేశపెట్టినప్పుడే ఇది సార్థకమవుతుంది.

నాలుక చేసే పాపములు ఐదు. అసత్యమాడటం ఒకటి. చాడీలు చెప్పడం మరొకటి. పరులను దూషించడం ఇంకొకటి. ఒక విధమగు మన స్తత్వముచేత అసత్యమైన దానిని సత్యమైనదానినిగా నిరూపించుట మరొకటి. చెప్పి తప్పించుకునేది ఇంకొకటి. కనుక ఈ నాలుకను అతి జాగ్రత్తగా మనం పెట్టుకున్నప్పుడే ఈ ఐదు పాపములకు గురికాకుండా ఉంటాము. ఒక్క నిమిషంలో పశువా, అంటుంది; రెండవ నిమిషములో పశుపతి అంటుంది. కనుక, జిహ్వను అరికట్టుట అన్నది ప్రధానమైన విషయముగా పవిత్ర వేదములు ప్రబోధిస్తూ వచ్చాయి.

కనుక ఈ శబ్దస్పర్శరూపరసగంధాత్మకములైన పంచేంద్రియములను మనము అరికట్టి వాటిద్వారా మన జీవయాత్ర సలుపడము అత్యవసరమని బోధిస్తూ ప్రబోధిస్తూ వచ్చినవి, యజ్ఞయాగాది క్రతువులు. ఎవ్వడు ఈ ఐదు ఇంద్రియములను నిగ్రహించడో వాడు పశువుతో సమానం. పశువులుకూడ, ఒక్కొక్క సమయంలో ఏ గుణములూ లేక ఉద్రేకంలేక పరమశాంతముగా ఉంటూంటాయి. కానీ, మానవుడు ఏ విధమైన సమయసందర్భములు లేకుండా పశుగుణములతో ఇతరులను బాధిస్తూంటాడు. ఈ పశుగుణములను ఏనాడు మనం బలి చేతుమో ఆనాడే మనము యజ్ఞయాగాదిక్రతువులకు యజమానిగా ఉంటాము.

నీవు యజమానివి కావాలికానీ పరిచారకుడు కారాదు. పరిచారకునకు కేవలం గృహమున పైపైనున్న పదార్థములు మాత్రమే తెలుసును. కానీ, విలువైన నగలు, ఏ పెట్టెయందు, ఏ స్థానమునందు భద్రపరిచామన్న సంగతి యజమానికే తెలుసు. అదేవిధముగనే అనిత్యము, అశాశ్వతము, అసత్యమైన లౌకిక విషయముల తెలుసుకొనువాడు పరిచారకుడు. ఎవ్వడు విలువగలవియై నిత్యసత్యనిర్మలభావములను గుర్తించునో వాడే యజమాని. ఈనాడు మానవుడు లౌకిక ప్రపంచముయొక్క, భౌతికమోహవిషయములందు మాత్రమే తన మనస్సును ప్రవేశపెట్టి అనేకవిధములుగా విచారణ చేస్తున్నాడు. కనుక ఈ పశుదృష్టిని మనం కొంతవరకు మరల్చుకుని పశుపతిదృష్టిని మనం అభివృద్ధిపరచుకోవడం మానవత్వమునకు సరియగు కర్తవ్యం.

కేవలభౌతికదేహపోషణ, భౌతికదేహసుఖసంతోషములు, భౌతికదేహభోగభాగ్యములు ప్రధానమైనవి కావు. ఇవన్నియు తుమ్మునంతలో తూలిపోవు తొమ్మిదితొర్రల తోలుబొమ్మకుగల ప్రధానలక్షణములు. ఇవి కేవలము క్షణభంగురమైనవి. ఉన్నంతలో పరాధీనం కాకుండా కాపాడుకోవాలి. దేనినిమిత్తమై దీనిని కాపాడుకోవాలి? "పరోపకారార్థం ఇదం శరీరం" ఇతరులకు మంచిని చేసేనిమిత్తము, తన మంచిని తాను గుర్తించుకునే నిమిత్తము దేహాన్ని పోషించుకోవాలి. అంతేకానీ స్వార్థమనే పిశాచాన్ని పెంచుకోవడానికి కాదు. కేవలము అహంకారమనే దయ్యాన్ని పెంచుకునే నిమిత్తంకాదు. ఈ విధమైన సత్యాన్ని గుర్తించినప్పుడే భారతీయుల సంస్కృతిని పవిత్రం గావించిన వారమవుతాము.

అనాదికాలమునుండి భారతీయసంస్కృతియందు పవిత్రమగునట్టివి, సత్యం వద! ధర్మం చర! సత్యమును చెప్పాలి, ధర్మముగా ఉండాలి అనునవి. కానీ, ఈ నాడు సత్యం వధ, సత్యమనేది ఎక్కడ చూచినా కనిపించడం లేదు. ఎక్కడ వెతికినా చిక్కడం లేదు. ఈ నాడు ప్రపంచములో అన్ని పదార్థముల వెల పెరిగిపోయినది; కానీ, సత్యమును కోల్పోవడం చేత మానవుని వెల చాలా తగ్గిపో

యింది. తక్కువ వెల అయినపదార్థము లోకములో ఏది అని ప్రశ్నిస్తే ఒక్కమానవుడు మాత్రమే! కేవలము గొప్ప గొప్ప చదువులు చదివితే ఘన కార్యము కాదు; గొప్పతనమూ, కాదు. గొప్ప గొప్ప పదవులలో ఉంటే గొప్ప విలువకాదు. గొప్పగుణములు ఉన్నప్పుడే అతనికి విలువ. తన గుణములను ఇతరులకు ప్రసరింపచేయు మార్గములోకూడా తన కాలమును పవిత్రంగావించుకోవాలి. కనుక మానవుని విలువ గుణముపై ఆధారపడి ఉంటున్నది. కానీ, ధన కనకవస్తువాహనములపై కానీ, అధికార పదవులపై గానీ ఆధారపడిఉండలేదు. ఇవి క్షణభంగురమైనటువంటివి. అధికారములో ఉండెనా అందరూ చేతులు కట్టుకుంటారు. అధికారమునుండి దిగెనా అందరూ చేతులు పైకెత్తుతారు. ఈ అధికారము ఎంత కాలము? మనము ధరించిన దేహములే మనకు సత్యములు కావు: నిత్యములు కావు. మనం కూర్చున్న ఛైర్ ఎంతకాలముంటాది? ఈ ఛైర్‌ల కోసంప్రాకులాడేవారికి ఇదొక పెద్ద రోగము. దేశ క్షేమముకానీ, మనుషుల పవిత్రతగానీ, వారియోగ క్షేమములుగానీ, విచారించే దిక్కులేకుండా పోతున్నది భారతదేశములో.

ఈ విధమైన అహంకారాన్ని స్వార్థాన్ని ఏనాడు మనం నిర్మూలంగావించుకుని ఎవరికి వారు సంరక్షకులై తమద్వారా దేశాన్ని సంరక్షించుకునే పరిస్థితికి ఏనాడు కంకణం కట్టుకుందుమో ఆనాడే ఆస్తికత్వము మన భారతదేశమునందు అభివృద్ధిగావించుటకు అవకాశముంటున్నది. ప్రేమస్వరూపులారా! ముఖ్యముగా అహంకారము, అసూయ, స్వార్థము ఈ మూడు పిశాచములను ఏనాడు దూరం చేసుకుందుమో ఆనాడే మానవత్వమనేది ప్రకటిస్తుంది; వికసిస్తుంది. ఇవి మనలో ఉండినంతవరకునూ, మన మానవత్వాన్ని కొంతవరకు మరుగు పరుస్తుంది. 'జంతూనాం నరజన్మదుర్లభం'. ఈ ఎనుబదిలక్షల జీవరాసులయందూ, మానవజన్మము పవిత్రమని అనేక విధములుగా మనం చెబుతున్నాము. కానీ, దానిని ప్రదర్శించడంలేదు. ఏనాడు 'నేను మానవుడిని' అని గుణరూపకంగా నీవు నిరూపిస్తువో ఆనాడే దివ్యత్వమనే ఆత్మతత్త్వము తప్పక నిన్ను అనుగ్రహిస్తుంది. కనుక మనము పవిత్రమైన నాలుక చేత పరమాత్మచింతనను సలిపి, పరోపకారమైన మాటలచేత పరులను ప్రశాంతపరచి ప్రబోధల చేత, ప్రచారము చేత మన జీవితాన్ని సార్థకపరుచుకోవాలని నేనాశిస్తూ, ఆశీర్వదిస్తూనాప్రసంగాన్నివిరమిస్తున్నాను.

భగవానుని దివ్యోపన్యాసము.
విజయదశమి, **1-10-79.**

# 'భ్రాంతి'

అజ్ఞానమనే చీకటిలోమంచిసుగంధమునందించే పూలమాలను చూచి మనము పాము అని భయభ్రాంతులకు గురియైపోతున్నాము. కానీ మన భయము పాము అన్న భ్రాంతిచేత ఏర్పడినదేకానీ సత్యముగా ఏర్పడినది కాదు. ఎప్పుడు మనము 'టార్చిని' వేసి ఇది పూలమాల అని గుర్తించుకుందుమో అప్పుడు పాము అన్న భయం వదలిపోతుంది. అదేవిధముగనే మనము నేను దేహమును, నేను ఇంద్రియములను, నేను మనస్సును, నేను బుద్ధిని అన్న భ్రాంతితో ఉండటం చేతనే మనము అనేకదుఃఖములకు, అనేకవిచారములకు, అనేక అశాంతులకు గురియైపోతున్నాము. మనము విచారణచేత దేహేంద్రియమనోబుద్ధులు నేను కాదు, అనే సత్యాన్ని గుర్తించుకుంటే మనలను బాధలు ఏ మాత్రముకూడనూ బాధించవు. మనము ఈ భయభ్రాంతులకు గురి అవుతున్నామంటే నిజముగా మనము దేహభ్రాంతులచేత జీవిస్తున్నాము. కనుకనే ప్రాచీనఋషులందరూ కూడనూ దేహభ్రాంతులను దూరం చేసుకునే నిమిత్తమై, దేహము నేను కాదు అన్న ఆదర్శం లోకానికి అందించే నిమిత్తమై అరణ్యములకు పోయి దేహములు త్యజిస్తూ వచ్చారు. కనుక ఈ విధమైన సన్యాసత్వము తీసుకోవడంకానీ, అడవులలోసంచరించడం కానీ, అనేక విధముల త్యాగమునకు పూనుకొనడంకానీ, కేవలము ఒక విధమైన ఆదర్శవంతమైన జీవితాన్ని అందించుకునే మార్గములే తప్ప, అన్యమైన మార్గములుకావనే సత్యాన్ని మనం గుర్తించాలి.

సత్యము తెలుసుకోకుండా ఉండినంతవరకునూ మనకు సందియము తప్పింది కాదు. సందేహము మనలో ప్రవేశించెనా సత్యము మనకు గోచరము కాదు. వీధివాకిటిలో సందేహము ప్రవేశిస్తే పెరటివాకిలిలో నమ్మకమనేది పారిపోతుందిట. కనుక మన faith అంతా పారిపోతున్నదనగా ఏమిటి? వీధివాకిటినుండి సందేహములు మన ఇంటిలో ప్రవేశిస్తున్నాయి. సందేహము అనేది హృద్రోగము. ఈహృద్రోగమనేది ఏదోక్షణములో పెనుభూతమువలె మ్రింగిపోతుంది. కనుక మనను మ్రింగే పెనుభూతము ఏమిటంటే హృద్రోగము. హృద్రోగము ఏదంటే సందేహము కనుకనే "సంశయాత్మా వినశ్యతి" అని భగవద్గీత బోధిస్తూ వచ్చింది. నీకు సంశయమున్నంతవరకు వినాశము తప్పిందికాదు. కనుక నీవు పరిపూర్ణ నమ్మకముతో కార్యరంగములో కాలిడు.

ఈనాడు బాలవికాస్ గురువులందరూ నిస్సంశయముగా మనము నిర్ణయించిన ఆశయాలను పవిత్రహృదయాలతో ఆచరణలో పెట్టాలి. ఇవి చాలా ఉత్తమమైన ఆశయాలు, పవిత్ర సాధనలు అని మనము బహిరంగసభలలో మాత్రము చెప్పి, మనము ప్రత్యేకంగా, నిత్యజీవితములో వాటిని విశ్వసించక, వాటిని ఆచరించకుండా పోయిన ఇది మహాద్రోహంగా ఏర్పడుతుంది. మనము గొప్పగొప్ప పదములు ఉచ్చరిస్తూవస్తూన్నాము. కాని వాటిని ఆచరణలో అతిస్వల్పంగానైనా మనముంచుటలేదు. నేడు లక్షలమైళ్ళ దూరంలో ఉన్న చంద్రునివద్దకైనా ప్రయాణం చేస్తు

నారు. చంద్రునియొక్క తత్వాన్ని గుర్తిస్తున్నారు. ప్రక్కింట్లో ఉన్నవారి పరిస్థితి ఎట్లున్నదో గుర్తించడం లేదు. ప్రక్కింటివారి పరిస్థితిని గుర్తించే శక్తిసామర్థ్యములు నీకు లేనప్పుడు లక్షలమైళ్ళ దూరంలో ఉన్న చంద్రుడిని గుర్తించి ఫలితము ఏమిటి? కనుక మనము గొప్పగొప్పభావాలంతా కూడనూ ప్రసరించడంకానీ ప్రబోధించడంకానీ అధికంగా చేయక, చిన్నచిన్న విషయాలను మనము ఆచరణలోపెట్టి అధిష్ఠానములో అనుగ్రహించి, తద్వారా ఇతరులకు అందించే ఆశయాన్ని మనం నిరూపించాలి.

ఈ నాడు బాలవికాస్‌యొక్క సమావేశనిర్ణయాలలో అనేకవిధములుగా సలహాలను అందుకుని కొన్నికొన్ని నిర్ణయాలను మనము నిరూపిస్తూవచ్చాము. ఇందులో ప్రధానమైన కొన్ని విషయాలను మీకు నేను తెలపాలని ఆశిస్తున్నాను. బాలవికాస్ గురువులను సరియైన మార్గములో తీర్చిదిద్దాలంటే, గురువులకు గురువులైనవారే దీన్ని తీర్చిదిద్దడానికి వీలవుతుంది. అనగా విద్యావిషయమును చక్కగా తెలిసినవాడు, విద్యారహస్యాన్ని చక్కగా గుర్తించినవాడు, పిల్లలకు ఏవిధంగా ప్రబోధించాలి అనేప్రేమతత్త్వాన్ని కొంతవరకు కలిగినవాడు ఈ విద్యాగురువులకు కొంతవరకు సలహాలందించే వాడుగా ఉంటే ఈ విద్యాసమస్యలు మరింత విరివిగా అభివృద్ధిగావటానికి అవకాశముంటాది. కనుక ఈ బాలవికాస్ గురువులనేవారు State President స్వాధీనములో ఉండుటచేత అంతఅభివృద్ధి గావటం లేదు. కారణమేమనగా అన్ని స్టేట్లప్రెసిడెంట్లుకూడ విద్యావంతులుగాకానీ, గుణవంతులుగాకానీ, ఆదర్శవంతమైన జీవితాన్ని అందించే వారుగాకానీ, బాలలకు ఏవిధముగా ప్రబోధించాలి అనే శక్తిసామర్థ్యములు కలిగినవారుకానీ లేకపోవచ్చు. వారి వారి అనుభవములు ప్రత్యేకించి ఉండవచ్చు. వారి నిత్యజీవితములో ఇంకొక మార్గమును అవలంబించవచ్చు. కనుక నా వుద్దేశమేమనగా బాలవికాస్ గురువులకు, స్టేట్ ప్రెసిడెంట్లకు ఏ మాత్రమూ సంబంధం ఉండకూడదు. స్టేట్ ప్రెసిడెంట్‌లు కేవలము భజనమండలులు, సేవాసమితులు, సేవాసంస్థలు, సేవాదళములనను ఆధ్యాత్మిక మార్గములలో వారు ఎంతవరకైనను ప్రవేశించవచ్చు. బాలవికాస్ గురువులకు కేవలం కేద్రంనుంచే సన్నిహితసంబంధం ఏర్పడితే బాగుంటుంది. కనుక ప్రతివిషయాన్నికూడా కేంద్రమునననుసరించి, వారు ఆచరించడంచేత ఎంతైనా అభివృద్ధి కావడానికి అవకాశముంటుంది.

ఇంతేకాక మరికొన్ని లోపతాపములు మనం చెప్పుకోవలసి వస్తుంది. సహజంగా స్త్రీలు కొంత బలహీనులు. ఒకవిధమైన ఆవేశం వచ్చినా, లేక ఆనందం వచ్చినా లేక దుఃఖం వచ్చినా, వారు కొంతవరకు నిగ్రహించుకునే శక్తి తక్కువ. కారణమేమనగా వారికి ఇమోషన్, లేక ఎగ్జైట్‌మెంట్ (Emotion or Excitement) వచ్చిన తక్షణమే ఆస్టేట్ ప్రెసిడెంట్ అక్కడ ఉంటారు. కనుక అతవి వద్దకు పోయి మొరపెట్టుకోవడము, దానిమంచి కొంత తారుమారు కావడం జరుగుతున్నది. కనుక ఈ ఇమోషన్‌కానీ, ఎగ్జైట్‌మెంట్ కానీ, కొంతవరకు శాంతపడుటకై కేంద్రానికి తెలుపడానికి చాలా 'టైమ్' పడుతుంది. కనుక కొంతవరకు శాంతపడిపోతుంది. అంతేకాకుండా వారి ఎగ్జైట్ మెంట్లు అన్నీకూడనూ కేంద్రానికి తెలుపడానికి కొంచెం భయపడతారు. కనుక ఈ గురువులలో

కొన్ని అవకతవకలేర్పడటానికి ఏ మాత్రమూ అవకాశముండదు. కొంత భయముచేతనూ, కొంత వినయముచేతనూ కొంత సక్రమమైన మార్గాన్ని అవలంబించడానికి అవకాశము ఏర్పడుతుంది. కనుక నేటి నుండీ బాలవికాస్ గురువులు, వారి వారి సమస్యలు కష్టములు, కేంద్రము, అనగా 'కన్వీనర్, ప్రశాంతినిలయము, బాలవికాస్‌గురూస్.' అని అడ్రస్ రాసి వేసేస్తే నేనిక్కడ అన్నీ చూచుకుంటాను. క్రింద copy to world council secretary అని ఇందూలాల్‌షాకు పంపించాలి. కనుక ఈ మార్పులు కానీ, ఏకూర్పులు కానీ, ఇతరులు చేయుటకేమాత్రమూ అవకాశము లేదు. ఒక్క కేంద్రం నుంచి మాత్రమే జరగాలి. ఒకరిపైన ఒకరు తంటాలు చెప్పుకోవడం కానీ, ఓర్వలేనితనంతో కొన్ని లేనిపోనివి పుట్టించడంకానీ మన బాలవికాస్ గురువులలో ఏమాత్రమూ జరగకూడదు. ఏమైనా తప్పులు జరిగినప్పుడు మనలోమనం నిగ్రహించుకోవాలి. మనలోమనం సవరించికోవాలి. ఏ నాడు మనం నిగ్రహాన్ని సాధిస్తామో, ఆనాడే మనం అనుగ్రహానికి పాత్రులమవుతాము.

బాలవికాస్ గురువులు ఈ నిగ్రహశక్తిని అధికంగా పోషించుకోవాలి. అందరూకూడనూ అక్కచెల్లెళ్ళవలె, అన్నదమ్ములవలె మెలగినప్పుడే మనము విద్యార్థులకు బోధించడానికి అధికారులమవుతాము. మనలోమనకే భేదములు, మనలోమనకే అసూయాభావములు ఉండినట్లుగా విద్యార్థులకు తెలిస్తే ఇక విద్యార్థులు ఏ మాత్రమూకూడా బాగుపడరు. కనుక తెలిసో తెలియకో ఇంతకు పూర్వము వచ్చిన పొరపాట్లను ఈ నాటినుంచీ మనం సవరించుకుని సరియైన మార్గములో మనము ప్రబోధించడానికి తగిన కృషి చేయాలి. ఇద్దరుబాలవికాస్ గురువులలోపల ఒకరికొకరికి ఏమైనా మనస్తాపము కలిగిందీ అని తెలిస్తే ఇద్దరినీకూడా తీసి వేసేస్తాము. ఇందులో ఎవరిది దోషము ఎవరిది అదోషము అన్నది మేము విచారించము. ఇద్దరినీకూడనూ తీసివేస్తాము. ఇలాంటి చీడపురుగు ఒకటిఉన్నా ఇది అనేకవిధములుగా ప్రాకిపోతుంది. ఈ విధమైన చర్యను పూర్వమునుండీ తీసికొనక పోవడం చేతనే, ఇంతమంది గురువులు ఉంటుండికూడా శిష్యులు తక్కువగా ఉంటున్నారంటే ఇది చాలా కష్టంగా ఉంటున్నది. సంవత్సరమునకు ఒక్కొక్క గురువు నూరు మంది విద్యార్థులను తరిఫీదు చేయాలి. అప్పుడే 5 లక్షలమందినైనా, 1 లక్షమందినైనా 1 సంవత్సరానికి పవిత్రులను గావించడానికి అవకాశం ఏర్పడుతుంది. కనుక మనదేశంలో 9 కోట్ల 26 వేల బాలబాలికలుంటున్నారు. వీరు ఏవయసువారు 10 సంవ్సరములలోపువారే. 16 సంవత్సరములలోపువారు 22 కోట్ల 6 లక్షలమంది ఉంటున్నారు. ఏతావాతా అర్థభాగము యువకులుగా ఉంటున్నారు మనదేశంలో. సంవత్సరానికి 1 వెయ్యిమందిని మాత్రమే తయారు చేస్తున్నామంటే ఇన్ని కోట్లమందిని ఏనాడు మనం తయారు చేయగలము ? కనుక ఇది కేవలము ఒక తాబేలు నడకలాగా నడుస్తున్నది. కనుక ఇది శీఘ్రమైన స్థితిలో ఉన్నతస్థాయిని అందుకోవాలి.

దేశముయొక్క పరిస్థితి మీకు తెలియనిది కాదు. యువకులయొక్క ఉద్రేకాలుకానీ, యువకులయొక్క ఆశయాలుకానీ, యువకులయొక్క తెలివితేటలుకానీ, క్షణక్షణానికీ ఆకాశానికి ఎగురుతున్నాయి. ఇవి ఏ విధమైన వేగముతో పెరుగుతున్నాయో ఆవిధమైన వేగముతోనే తగ్గించడానికి ప్రయత్నం చేయాలి. పెరిగే వేగమునకు తగ్గించే వేగమునకు సరిసమానమైన స్థితి ఉంటుండాలి. అప్పుడే జగత్తు

ప్రశాంతిని అందుకోడానికి పిలవుతుంది. ఒక చిన్న ఉదాహరణము. వర్షములు కుంభములతో పోసినట్లు కురుస్తున్నాయి. కానీ భూమిలోనికి ఇమిడి పోవడము చాలా ఆలస్యంగా ఇమిడిపోతున్నాయి. ఒక్క సంవత్సరము ఇమిడిపోయిన జలమును, మనము పదినిమిషాలలో బయటకి కొట్టేస్తున్నాము. ఇమిడి పోవడం చాలా ఆలస్యంగా ఉంది. కొట్టివేయడం చాలా అధికంగా ఉండటంచేతనే మనము ఈనాడు జలాన్ని కూడనూ సమృద్ధిగా అనుభవించుకోలేని బలహీనులుగా ఉంటున్నాము. ఏనాడు నీటి కొరతను మనం తీర్చుకోగలము? ఏవిధంగా పైకి కొడుతున్నామో ఆవిధంగా క్రిందికి పోయేవేగాన్ని కనిపెట్టినప్పుడే ఈ జలమునందుకోగలము. అదేవిధముగనే పిల్లలయొక్క ఆశయాలు, అశాంతులు, పిల్లలయొక్క అల్లకల్లోలాలు అతివేగంగా పెరుగుతున్న సమయంలో మనము విదానంగా దానిని సరిదిద్దుకోవడానికి ప్రయత్నంచేస్తే సరియైన సమయానికి పూర్తిచేసికోలేము. కనుక మన ఆశయాలనుకూడను అమితంగా ఆచరించడం చేత అనేక మందిని ఆకర్షించడానికికానీ, అనేక మందిని తీర్చడానికి కానీ చక్కని అవకాశం ఏర్పడుతుంది. ఇంక మరొక విషయము. మనము అన్ని మతముల యొక్క సమత్వాన్ని ప్రబోధించాలి. 'బైబిల్'నందున్న కొటేషన్స్, ఆదర్శాలు, 'ఖురాన్'నందున్న ఆదర్శాలు, జోరాష్ట్రీయములో పార్శీవారియందున్న ఆదర్శాలు, ఇంకేవిధమైన సర్వమతములయందున్న ఆదర్శాలు, బుద్ధమతమునందున్న ఆదర్శాలు, పిల్లలకు చక్కగా కథల రూపకంగా, సరియైన రీతిగా తెలిపేటట్లు బోధించాలి. ఏమతమునుకూడా మన బాలవికాస్ గురువులు ద్వేషించకూడదు. ఒక మతమునకు మాత్రమే ప్రాధాన్యత ఇవ్వకూడదు. అనేకమంది భగవద్గీతలో ఉన్న శ్లోకాలన్నీ నేర్పించాలి అన్నారు. అది చాలా పొరపాటు. వారి శ్రద్ధాభక్తులతో వారు నేర్చుకోవడంలో మన అభ్యంతరమేమీ లేదు. కానీ మనము బోధించవలసినవి మాత్రము ఖురాన్, బైబిల్ అను గ్రంథములందున్నవి. అట్లే సర్వమతముల అభిప్రాయములను చక్కగా పిల్లలకు అర్థమయ్యే రీతిగా చెప్పాలి. సర్వమతసమన్వయమే సాయిమతమనేది మీరు చక్కగా గుర్తించాలి.

కొన్ని మతములు సాయిమతమును విరుద్ధపరచినప్పటికినీ, మనము మాత్రము విరుద్ధంగా భావించకూడదు. మతమును విరుద్ధంగా భావించే వారు అల్పులు. సర్వమతములను సమంగా భావించే వాడు పూర్ణుడు. కనుక మనము కూడా అల్పబుద్ధుల చేత ఛిన్నాభిన్నమైన మార్గమును అనుసరించి సంకుచితమైన భావమున మనము ఏమాత్రము కూడా ప్రవేశించకూడదు. ఈ విధమైన విశాలమైన హృదయాన్ని గురువులు అభివృద్ధి పరచుకోవాలి. అప్పుడే మన ఆశయాలు యావత్ప్రపంచమునకు కూడా ప్రచార ప్రబోధలు చేసే అర్హత కలిగి ఉంటుంది. ఇంకా కొన్ని కొన్ని మార్గములయందు పిల్లలకు సత్యమును పలకాలి, అనుదానివి సత్యమార్గమున ప్రవేశపెట్టాలి. ప్రతిఅధ్యాపకుడుకూడా చిరునవ్వు చిందులు తొక్కుచుండేట్లుగా పిల్లలకు బోధించాలి. వారిని కోపించడంగానీ, లేక కొట్టడంగానీ ఈ విధమైన శిక్షణను మనం ఏమాత్రమూ అవలంబించకూడదు. ప్రేమతో శాంతముతో, సహనముతో, మనం సాధించే కార్యము.

ఇది బృహత్కార్యము. ఈ బృహత్కార్యాన్ని సాధించడానికి ప్రేమతత్త్వమే ప్రధానమార్గము. ఏ కించిత్తైనా అహంకారాసూయలకు అవకాశమీకూడదు. కనుక ఈ నాడు మనము విన్న దేహేంద్రియ మనోబుద్ధితత్త్వములను ఈ చిరుతప్రాయము నందియే

పిల్లలకు చక్కగా బోధిస్తూ రావడంచేత ఈ మమకార అహంకారములకు ఏమాత్రమూ చోటులేకుండా, స్వార్థమనే పెనుభూతమునకు ఏమాత్రమూ గురికాకుండా దేశాన్ని ఉద్ధరించు వీరులుగా, శూరులుగా, ఘనులుగా, అభివృద్ధి గావించు అవకాశాన్ని ఈ నాడు మనం చేపట్టాలి. ఈ విధమైన శిక్షణను మనము విద్యార్థులకు అందించినప్పుడే దేశోద్ధారమునకు ఎంతైనా సేవచేసిన వారమవుతాము, పిల్లలతో చక్కగా అతిమధురమైన కంఠములచేత భజనలు చేయించాలి.

భగవానుని దివ్యోపన్యాసము.
బాలవికాస్ గురువుల సమ్మేళనం,
ప్రశాంతినిలయం. 21-11-79.

# చిత్తచోరు

చిరునవ్వు చిందించు
చిన్నారి మా ముద్దు సాయి.
తలచినంతనె పలికి
ప్రేమకురిపించు స్వామీ!
మాహృదయచోరుడవు
నీవె కదా! గోపాలబాలా!

పసివాని పలుకులలాగ, వచ్చిరాని పదాలతో రాగం మేళవించి పదేపదే గొణిగాను. past is past అన్నది బాబా ఎప్పుడూ చెబుతూవుంటారు. కానీ, గతాన్ని నెమరువేసి, ప్రస్తుతంతో ముడివేసి ఆ రెండిటి తారతమ్యంచూడటం మన అలవాటు. అదే ఆలోచిస్తూ నేను కూచున్నాను. 'సనాతనసారథి'కి రాయటం మూడోసారి యిది.

ఒక్కసారి తీక్ష్ణంగా వెనక్కి తిరిగి చూశాను. అంతాచిక్కని చీకటి. ముళ్ళకంపలు; రాళ్ళబాట. ప్రస్తుతం నేనిలిచిన బాటపై దృష్టి సారించాను. ఎదురుగా చందమామ చల్లని వెన్నెలలు కురిపిస్తున్నాడు. చల్లని సుగంధపరిమళసువాసనలు నన్నలుముకుని పులకరింప చేస్తున్నాయి. నేను ఆనందముతో ఒక్కమారు వుక్కిరి బిక్కిరయాను.

మళ్ళీ! ఒకసారి వెనక్కి చూశాను. అది నేనడిచిన బాటే! అయినా, భయంకరంగా కనిపించింది. ఆ బాధాకరమయిన బాటలోనుండి ఈ రాజమార్గానికి ఎట్లా రాగలిగాను? ఆ చీకటి నా అజ్ఞానానికి చిహ్నం. ఆ ముళ్ళకంపలు, రాళ్ళబాట, మా జీవితములోని కష్టవిఘ్నాలకి, అనేక బాధలకి, తార్కాణం. మరి! ఆ కఠినమైన బాటనుంచి మమ్ము రాజమార్గానికి చేర్చి, సేదతీరా ప్రేమామృతం గ్రోలమనే అదృశ్యశక్తి ఎవరు? నడకరాని పసివారికి దారిచూపే ఆ తల్లి ఎవరు? ఆ ప్రశ్నలకి సమాధానంగా స్వామిమోము ప్రశాంతంగా చిరునవ్వు చిందిస్తూ కనుల ఎదుట కనిపించింది.

" నేనుండగా నీకెందుకు భయం!" అది స్వామి అభయం. నిజమే! స్వామి అనుక్షణం మనలని ముందుకి నడిపిస్తూంటారు. ఆ చల్లని స్వామి కరుణా దృక్కులే ముళ్ళబాటని పూలబాటగా మారుస్తాయి; మారుస్తున్నాయికూడా. కానీ, ఈ సత్యం ఎరుగని వారికి నవ్వులాట, విమర్శనాభావం. ఎరిగిన వారికి ఆనందపుమూట. ఇది కేవలం అనుభవం నేర్పవలసిన పాఠం.

మానవునికి భయం, విచారం మించిన శత్రువులు వేరేవి వుండవేమో! అటువంటి హృదయం బలహీనమై, సర్వం నిరాశామయంగా గోచరిస్తుంది. నిరంతరచింతతో పరమాత్మస్వరూపమైన కాలం బూడిదలో పోసిన పన్నీరులా వృథా అయిపోతుంది. "సంసారమొక చింత చావు చింత, బాల్యమంతయు చింత'' అన్న బాబా మాటలద్వారా మనకి ఒక విషయం తెలుస్తుంది. సర్వచింతలకి మానసిక అశాంతి కారణం. మరి! ఈ అశాంతి తొలగేమార్గం ఏది? ఎట్లా లభిస్తుంది? అది విశ్రాంతిగృహాలలోను, బయట అన్వేషించటం మూలంగా లభించదు. సర్వభావములకు నిలయం మనస్సే అన్నది బాబా సమాధానం. మానసిక శాంతికోల్పోయిన నిస్పృహాయులకు బాబా ప్రేమపూరితమధురభాషణమే అమృతపు జల్లులు. బాహ్యంగా స్వామి పలికేది అందరిగూర్చి అనువిధంగా అగుపిస్తుంది. అదే స్వామి ప్రేమ భిక్షం.

కానీ! ఎవరిమటుకు వారికి ఈ మాట నన్ను వుద్దేశించి చెబుతున్నారా? అన్న సందేహం కలగంట తథ్యం. అదే బాబా ప్రత్యేకత. అదేనేమో! బాబా చెప్పే హృదయభాష. నాకు కలిగే అనేకసందేహాలకు సమాధానం ప్రతిమాసం 'సనాతనసారథిలో' స్వామి ఉపన్యాసంలో నాకు తప్పక లభిస్తాయి. ఇది నా అనుభవం.

అప్పుడప్పుడూ హృదయం, వేదనాపూరితమవుతుంది. కష్టాలలో కంటికి రెప్పలా వెంటనే, జంటనే నడిపించిన స్వామి, ఇప్పుడు ఎంతపిలిచినా పలకరేమిటి? ప్రేమమీర పిలవరేమిటి? అన్నబాధగలుగుతుంది. స్వామినుంచి మనం దూరమవుతున్నామా! మన నుంచి స్వామి దూరమవుతున్నారా! అన్నదానికి వెంటనే మనభావనాదోషాన్ని సవరిస్తూ స్వామి పలుకులు వినిపిస్తాయి.— ''మీరు నన్నువీడినా మిమ్ములనేవీడను." వేయబోవని తలుపు, తీయమంటూపిలుపు, కృష్ణకెందుకో నవ్వుగొలుపు."—వెంటనే నాహృది పలికింది. ''ఎంతిరాని, నాకెంతటోవి నీ చెంతవిడజాల—" "నా విశ్వాసమే శ్వాసగా విలువు నా దైవమా సాయి''.

-కాండూరి భార్గవి.

# సైన్సు, స్పిరిచ్యుయాలిటీ: ఒకే కాసుకి బొమ్మా బొరుసులా ?

రచయిత: ప్రొఫెసర్ ఎస్. వి. పప్పు. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు బెంగుళూరు.

ఉపోద్ఘాతము :

మనము సైన్సు, టెక్నాలజీ యుగములో నివసిస్తూన్నాము; మనముచూచేది, అనుభవించేది అన్నీ కూడా సైన్సుద్వారా అర్థం చేసుకొనగలిగిఉండాలి, అన్న మాటలు నాగరిక మానవునికి ఊతపదములుగా తయారు అవుతూవస్తున్నాయి. ప్రస్తుతవాతావరణంలో మానవుడు ఒక టెక్నలాజికల్ మృగము. ఒక డేటా ప్రోసెసింగు మృగము అని పిలువబడుతున్నాడు. నాగరికమానవునికి "మృగము" అన్న పదము ఉపయోగించబడడం చాలా గమనించవలసిన విషయము. సైన్సు, టెక్నాలజీలయొక్క ఫలితములు అద్భుతమయినవి అనుటలో అతిశయోక్తి ఎంతమాత్రము లేదు. "అణోరణీయాన్ మహతోమహీయాన్" అన్న గీతావాక్యానుసారంగా మానవుడు సూక్ష్మరూపాత్మకమయిన అణువునుగూర్చి స్థూలరూపాత్మకమయిన అంతరిక్షమును గూర్చియు చాలా పరిశోధనలు గావిస్తూవచ్చేడు. సైన్సువలన మానవుడు సుఖమును, విశ్రాంతిని చాలవరకు పొందగలిగినాడే కాని మనశ్శాంతిని మాత్రం పొందలేక పోయేడు. అయితే ఈ రోజులలో నాస్తికతత్వవేత్తలు మాత్రం మనశ్శాంతికూడా సైన్సువలన పొందవచ్చును, దీనికోసం ప్రత్యేకంగా ఏ స్వాముల వద్దకు పోనవసరం లేదని, ఇళ్లపైకప్పులమీదనుండి ప్రచారం చేయడానికి సంసిద్ధులగుచున్నారు. గతించిన శతాబ్దముల కంటే ఈ శతాబ్దములోనే మానవుడు దారి తెన్ను తెలుసుకోలేక అయోమయంలోపడి కొట్టుకొంటున్నాడన్నచో అతిశయోక్తి ఏమియు లేదు.

మానవుని అభ్యుదయానికి సైన్సు, స్పిరిచ్యుయాలిటి ఎంతవరకూ తోడ్పడుచున్నాయి అన్న ప్రశ్నకు విభిన్న అభిప్రాయాలు వ్యక్తపరచడమే ఇట్టిపరిస్థితి ఏర్పడుటకు కారణం అని కన్పిస్తున్నది. భగవంతుడున్నాడు అన్న ప్రశంస అనవసరం అని సాధారణంగా సైంటిస్టు అనుకొంటాడు; అయితే స్పిరిచ్యులిస్టు మాత్రం భగవంతుడున్నాడు అన్న ప్రశంస అవసరమే కాక చాలా ముఖ్యం అని అనుకొంటాడు. భగవంతుని మీద నమ్మకం ఉన్న ప్రఖ్యాతసైంటిస్టు ఐన్‌స్టైన్ ఒక సారి యిలా అన్నారు: "రెలిజన్ లేని సైన్సుకుంటిది; అయితే సైన్సులేని రెలిజన్ గ్రుడ్డిది. ఈ వాక్యమును ఆధారంచేసుకొని, సైన్సువల్లనే మానవుడు తననుతాను పూర్తిగా అర్థం చేసుకొనడం జరుగగలదు, అని, చాలామట్టుకు ప్రస్తుతకాలం సైంటిస్టులు అనుకొంటున్నారు. వీరి అభిప్రాయంలో స్పిరిచ్యుయాలిటి కుంటివానిచేతిలో కఱ్ఱవంటిది—ఉంటే మంచిదికాని అంత అవసరంలేదు. అయితే స్పిరిచ్యుయల్ లీడర్సుకూడా అహంకారప్రదర్శనములో సైంటిస్టులతో పోల్చిచూస్తే ఏమి తీసిపోరు. మానవప్రగతికి స్పిరిచ్యుయాలిటి తప్ప వేరే మార్గంలేదని, స్పిరిచ్యుయాలిటి సైన్సుకి అతీతమని వాళ్ల అభిప్రాయం. ఇట్టి అభిప్రాయం దృఢపరచే నిమిత్తం సాధారణంగా

స్పిరిచ్యులిస్టులు, "సైన్సు ఎక్కడైతే ఆగిపోతుందో అక్కడినుండి స్పిరిచ్యుయాలిటి ప్రారంభం అవుతుంది" అని అంటూంటారు. ఈ విధంగా ప్రస్తుత ప్రపంచములో సైంటిస్టులు, స్పిరిచ్యులిస్టులు ఉత్తర ధ్రువం, దక్షిణధ్రువం అన్నరీతిగా ప్రవర్తిస్తూన్నారు; అందుచేత ఒక ప్రశ్న వ్యుత్పన్నమౌతుంది. "సైన్సు, స్పిరిచ్యుయాలిటి ఒక దానికి ఒకటి విరుద్ధమా; లేక ఈ రెండుకూడా ఒకే కాసుకి బొమ్మా బొరుసులా? ఈ ప్రశ్నకు కొంతవరకు జవాబు యియ్యడానికి ఇక్కడ ప్రయత్నిస్తాను. అయితే ముందుగా సైన్సు, స్పిరిచ్యుయాలిటి అన్నపదములకు సరియయిన అర్థమే మిటో తెలిసికొనడం చాలా అవసరం; ఎందుచేత నంటే ఈ కాలంలో ఈ రెండుపదములయొక్క అసలయిన అర్థము చాలావరకు మఱచి వాటియొక్క ప్రయోగము, వక్రగతి పట్టింది అని నాసంశయం.

సైన్సు అంటే ఏమి —స్పిరిచ్యుయాలిటి అంటే ఏమి ?

సత్యాన్వేషణ, లేక సత్యముకోసం విచారణసలుపుట, అన్నపనులు సైన్సుకి, స్పిరిచ్యుయాలిటికి రెండింటికికూడా ముఖ్యమయినవి. ప్రస్తుతం సైంటిఫిక్ మెథడ్‌కి (scientific method) సైన్సుకి తేడా ఉంది అన్నమాటవదలివేవి. సైంటిఫిక్ మెథడ్ (scientific method) నే సైన్సు అనివ్యవహరించడం జరుగుతున్నది. ఈ కారణంగా సైన్సు చాలా 'నూతనమయిన కార్యక్రమము,' అని అనుకొనడం జరుగుతున్నది. సైంటిఫిక్ మెథడ్(scientific method) సిద్ధాంతము, ప్రయోగము, పరిశీలన, అనుమానము అనే నాలుగు స్తంభములమీద కట్టబడిన సౌధము. సైంటిఫిక్ మెథడ్ (scientific method) వలన ఎంతవరకూ మానవుడు ప్రకృతియొక్క రహస్యములను తెలుసుకొనగలిగినాడో న్యూటన్, ప్లాంకు, ఐన్‌స్టైన్, రూధర్‌ఫర్డ్, బోర్, ఫెర్మి మొదలగు విజ్ఞానప్రముఖుల పనులవలన మనకు విశదమయినవిషయమే! కాని ఒక ప్రశ్న న్యూటన్ గ్రావిటేషను సిద్ధాంతము కనుగొనకముందు గ్రహములు తమతమ నిర్ణీతమయిన వలయములలో ప్రయాణము చేయలేదా? ఎమర్సన్ అన్నారు: "ఆశ్చర్యపడుటయన మానవునికి మహాప్రీతి, అట్టి కార్యములోనే సైన్సు అనేబీజం అంకురించి వుంటుంది." అని అందువలన, నా అభిప్రాయప్రకారం, మానవుడు ఈ పృథివిపైన పుట్టినప్పటినుండి సూర్యుని, చంద్రుని నక్షత్రములనుగూర్చి ఆశ్చర్యపడుతునే ఉండాలి. ప్రపంచం సృష్టింపబడినప్పటినుండి సైన్సు జరుగుతూ వస్తూన్నది; అయితే ఈ సైన్సుని అర్థం చేసుకొనే నిమిత్తం మానవుడు సైంటిఫిక్ మెథడు (scientific method) అన్నది కనిపెట్టినాడు. ఆ సైంటిఫిక్ మెథడ్ (scientific method) నూతనమయినది కాని సైన్సు మాత్రము చాలాపురాతనమని అని నా అభిప్రాయము.

అదేవిధముగా స్పిరిచ్యుయాలిటి అన్నదికూడా సైన్సు లాగే చాలా పురాతనమయినదని, అని అనిపిస్తుంది. ఎందుచేతనంటే మానవుడు ప్రప్రథమంగా తానెవరు? అన్న ప్రశ్నకు జవాబుకోసం పాకులాడుతూ ఉండే ఉండాలి. అయితే సైన్సుకి, సైంటిఫిక్ మెథడు (Scientific method)అని ఉన్నట్లే, స్పిరిచ్యుయాలిటికి, స్పిరిచ్యుయల్ మెథడు (spiritual method) ఏమయినా ఉందా? నా అభిప్రాయమేమంటే రెలిజన్ అన్నదే స్పిరిచ్యుయల్ మెథడ్ (spiritual method) రెలిజియన్స్ (హిందూమతము,

క్రైస్తవమతము మొదలగునవి) ఏవిధముగా మానవవునికి స్పిరిచ్యుయల్ ప్లేనులో సత్యమును కనుగొనడానికి తోడ్పడగలవో, అదేవిధముగా ఫిజిక్సు, కెమిస్ట్రీ మొదలగు సైంటిఫిక్ మెథడులు scientific methods సైన్సు ప్లేనులో సత్యమును కనుగొనుటకు తోడ్పడగలవు, ఆ కారణంగా సైంటిఫిక్ మెథడును "సెలిజన్" అని పిలవాలని నేను అనుకొంటున్నాను.

సైన్స్, స్పిరిచ్యుయాలిటి ఒక దానికి ఒక్కటి విరుద్ధమా లేక ఈ రెండూ ఒకే కాసుకి రెండుప్రక్కలా?

సైన్స్, స్పిరిచ్యుయాలిటి మానవుడు ఎంతపురాతనుడో అంతపురాతనము అయినవిఅని నేను వ్యక్తపరిచినాను. తననుగూర్చి గాని తనచుట్టూ ఉన్న బాహ్య ప్రపంచమును గూర్చిగాని తెలుసుకోవాలి, అని మానవుడు ఎప్పటినుండో ఆశపడుతూనేఉండాలి. ఆ విధమయిన ఆశవల్లనే సైంటిఫిక్ మెథడు (సెలిజన్), స్పిరిచ్యుయల్ మెథడు (రెలిజన్) అన్నమార్గములు వ్యక్తమవుతూవచ్చేయి

అయితే ఈ ఆశతోపాటు Objective Observation అనే పనికూడా స్పిరిచ్యుయాలిటీకి, సైన్సుకి మూలముగాఉండాలి. రమణమహర్షి తనదేహము చనిపోవటం తాను చూడగలిగినట్లు పుస్తకములలో వ్రాస్తారు. ఆ విధమయిన Objective Observation ఇంకా సైన్స్‌లో వీలుపడలేదు. ఎందుచేతను అంటే హైసన్ బెర్గ సిద్ధాంతప్రకారం "పరిశీలించేవాడు" "పరిశీలించబోయేదానిని" కలత పొందిస్తాడు. అయితే నా అభిప్రాయప్రకారం హైసెన్ బెర్గ సిద్ధాంతము సైంటిఫిక్ మెథడు తాలుకా, లిమిటేషను తెలియపరచుచున్నదితప్ప, సైన్సుయొక్క లిమిటేషన్ తెలియపరచలేదు. ఎప్పుడైతే Objective Observation సైన్సులో కూడా వీలగునో అప్పుడు సైన్స్‌కి, స్పిరిచ్యుయాలిటికి భేదము ఉండకూడదు; ఎందుచేతనంటే అట్టిపరిస్థితులలో "అహం" నాశనము అయిఉంటుంది. అందుచేత ఆస్థితిలోమానవునిలోని దివ్యత్వము మహాదేదీప్యమానముగా ప్రకాశిస్తూ ఉంటుంది. సైన్సు, స్పిరిచ్యుయాలిటి ఒకదానిలో మరియొక్కటి కలిసిపోయేస్థితి మానవునిలో ఏర్పడనంతవరకూ కూడ సైన్స్, స్పిరిచ్యుయాలిటి ఒకేకాసుకి బొమ్మాబొరుసులు, అని తలచుకోవలసి ఉంటుంది. ఈవిధముగా సైన్స్, స్పిరిచ్యుయాలిటీ లను అర్థము చేసుకొనడంవలన అవతారము అంటే కొంతవరకూ అవగాహనచేసుకొనేందుకు సాధ్యమవుతుందని నామనవి. పూర్తి అవతారపురుషునిలో, అంటే శ్రీ సత్యసాయిబాబా వంటి వారిలో, సైన్స్ మరియు స్పిరిచ్యుయాలిటి ఒక దానిలో ఒకటి లీనమై ఉండడం జరుగుతుంది. అందుచేత అట్టిమహాత్ములు—అదిఏమిటి? ఇది ఏమిటి? నేను ఎవరు? అన్న ప్రశ్నలకు ప్రయాసమేమి లేకుండ జవాబులివ్వగలరు. అందుకే శ్రీ సత్య సాయి బాబా పూర్ణావతారము అని నిరూపణకు వీలుకలుగుతూ వస్తుంది. ఐన్‌స్టైనులాంటి మహావిజ్ఞానవేత్తను 'పాది' అవతార పురుషుడనవచ్చును. ఎందుచేతనంటే అటువంటి వారిలో సైన్సు, స్పిరిచ్యుయాలిటిలో లీనమయినట్టు కనిపించదు.

# కాలేజి విద్యార్థులు

విద్య విజ్ఞానము నిమిత్తము కానీ ఉద్యోగనిమిత్తము కాదు. ఈనాడు విద్య అనేది జీవితము నిమిత్తమై ఏర్పడినది; కానీ జీవించేనిమిత్తమై కాదు. జీవిత మంటే ఏమిటో ఆసత్యాన్ని గుర్తింపచేసేదే నిజమైన విద్య. అంతఃకరణను పరిశుద్ధము గావించేది విద్య. నానా దుర్గుణములను, దురాలోచనలను, దుష్ప్రవర్తనలను హృదయానికి నింపుకొనేటువంటిది విద్యకాదు. నైతిక, ఆధ్యాత్మిక, శీలసంపత్తిని, అభివృద్ధి గావించేటువంటిది విద్య. తప్పొప్పులు ఏమిటో అనే దానిని నిర్ణయించేసమయంలో మానవునికి సహాయకారిఐనది విద్య. వినయ, విధేయతలు నేర్పేదివిద్య.

పూర్వకాలమునందు విద్యాలయములకు వెళ్ళే విద్యార్థులందరిని కూడనూ 'వినేయుడు' అనిపిలిచేవారు. వినేయుడు అనగా వినయమును గరచేనిమిత్తమై విద్యాలయములకు వెళ్ళేవాడు అని అర్థము. ఈనాడు వినేయులు ఎక్కడా కనిపించిడంలేదు. వినయము మానవుని సహజ గుణము. అహంకారము కేవలము మృగముయొక్క లక్షణము. గురువులదగ్గర గానీ, తల్లిదండ్రుల దగ్గరకానీ, లేక పెద్దలదగ్గర కానీ వినయ విధేయతలు ప్రకటించడమే మానవత్వమునకు సరియైన గుర్తుకనుకనే ప్రాచీనులు 'విద్యయొసగును వినయంబు'. 'వినయమునను కలగుపాత్రత' 'పాత్రతవలనధనము'. 'ధనము వలన ధర్మంబు.' 'ధర్మము వలన ఐహిక ఆముష్మికములనందగలరు,'' అన్నారు. ఈనాడు విద్య అనగా కేవలము ధనార్జన అంటున్నారేకానీ వినయవిధేయతలు నిర్మూలమైనాయి. వినయమునకు క్రమశిక్షణ అత్యవసరము. క్రమశిక్షణ లేని జీవితము మృగసమానము. క్రమశిక్షణే మనయొక్క శీలతత్త్వాన్ని అభివృద్ధి పరుస్తుంది. శీలమే ప్రాణము.

కానీ ఈనాడు విద్యార్థులయందు ఈవిధమైన వినయ, శీలములు నిర్మూలమైపోయినవి, మనము నేర్చిన విద్య లన్నియు పొట్టకూటి నిమిత్తమా ? కాదు కాదు. దేశము యొక్క, సమాజముయొక్క, కుటుంబము యొక్క సమస్యలను, చక్కగా విచారణ సలిపి శాంత మైన జీవితముతో సత్యమార్గములో ప్రవేశించి మానవత్వాన్ని నిరూపింపచేసేదాన్ని మనం ఈనాడు నేర్చుకోవాలి. ఈనాటి విద్యార్థుల దుస్థితి ఏరకంగా ఉంటున్నది అంటే ఒక చిన్న ఉదాహరణ. విద్యార్థి తాను ధరించిన ఇస్త్రీబట్టలు ఏమాత్రమూ నలగకుండా సున్నితమైన పనిలో పంకాలకింద, ఏర్ కండిషన్ గదిలో హాయ్చుని ఏవోకాగితములమీద సైనుపెట్టే సుఖాంతమైన ఉద్యోగం అందుకుని ధనమును అధికంగా ఆర్జించి, లోకసంబంధమైన భోగభాగ్యములు అనుభవించాలనే తుచ్ఛమునకు గురి అవుతున్నాడు. శ్రమించి పనిచేయడానికి విద్యార్థి ఏమాత్రమూ ముందంజ వేయడంలేదు. ఇది కేవలము ఒక సోమరిపోతు ఆశించే వాంఛలు తప్ప శ్రమించి పని చేసే కష్టజీవి ఆశించే ఆశయములు కావు.

ప్రాచీనగురుకులము నందు కేవలము జీవితనిమిత్తమై భుజించేవారు. కానీ అన్నం నిమిత్తమై జీవించేవారు గాదు. కానీ ఈ నాటియొక్క యువకులందరు తిండికోసం జీవిస్తున్నారు. పశుపక్షిమృగాదులుకూడాతిన

డంలేదా? దేహానికి ఆహారము అవసరము, కానీ నిరంతరము 'ఆహారము, ఆహారము' అని పరితపించే మూర్ఖత్వములో ప్రవేశించకూడదు. మనకంటేహీనమైనపరిస్థితియందు, ఎన్నికోట్లమందిజీవులు హింసింపబడుతున్నారో అట్టి దీనులను కొంత ఆదుకుని, శ్రమించి, వారికి సహాయం సలిపే జీవితాన్ని మనం కొంతవరకు తీర్చి దిద్దుకోవాలి. లౌకికవిద్యలతోపాటు సంస్కృతిని, నైతిక గుణములనుఅలవరచుకోవాలి. పవిత్రమైనరామాయణం, భారత. భాగవత, భగవద్గీత ఇత్యాది గ్రంథములయందు, బైబిల్, ఖురాన్ ఇత్యాది పవిత్ర గ్రంథములయందు కూడనూ, మానవత్వముయొక్క నిర్మాణాత్మకమైన సత్యాన్ని నిరూపిస్తూ వచ్చాయి.

ఈ నాటి విద్యార్థులు విద్యయొక్క లక్ష్యాన్ని ఏ మాత్రమూ ఉంచు కోవడంలేదు. పరీక్షలయందు ఏ విధముగా పాస్‌కావాలి? ఏ విధంగా మార్కులు తెప్పించుకోవాలి? అనే మార్గమునందే ప్రవేశిస్తూ ఉన్నారు. పాసుకావడమనేది ప్రధానమైనది కాదు. విద్యయందున్న లక్ష్యాన్నిగుర్తించడమే మనకర్తవ్యం. డిగ్రీ తెప్పించుకోవడమనేది పెద్దసమస్యకాదు; కాపీకొట్టి డిగ్రీ తీసుకోవచ్చును, పుస్తకంపెట్టిరాసి డిగ్రీతెప్పించుకోవచ్చును, చేతినిండా కాళ్లనిండా రాసుకుని డిగ్రీతీసికోవచ్చును; ఈ విధమైన పెడమార్గమున తీసుకోవడము నిజమైన విద్యకాదు. విద్యార్థులారా! ఇలాంటి సమస్యలు అనేకకళాశాలలయందు జరుగుచునే ఉంటున్నవి. కానీ అనేకకళాశాలలకు మనకళాశాలలకు ఉన్నవ్యత్యాసాన్ని మీరు గుర్తించాలి. నిజముగా మేము ఈయొక్క ప్రాకృతసంబంధమైన విద్యల నిమిత్తమై ఈ కళాశాలలనుసంకల్పించలేదు. ఏ బి.ఏ.నో ఏ బి.కామో, ఏ బి.ఎస్‌సినో అందించే సంకల్పం మాకేమాత్రము లేదు. ఈవిద్య అనే కారణముచేత మిమ్మల్నిక్కడకు రప్పించుకుని భావిభారతోద్ధారకులుగా తయారుచేసి సత్యధర్మశాంతిప్రేమలచేత ఈయొక్క ఆశయాలను జగత్తునకు అందింపచేసే నిమిత్తమే మేము చేర్చుకుంటున్నాము. కేవలము ఈ లౌకికవిద్య లేకుండిన, మీతల్లితండ్రులు మిమ్మల్నిక్కడకు పంపించే వారుకాదు. మీరిక్కడకు చేరేవారుకారు.

ఈ లౌకిక విద్యలవల్ల తల్లితండ్రులకు కానీ, విద్యార్థులకు కానీ ఒకవిధమైన మోజు అభివృద్ధిగావటం చేత ఆమోజును కూడనూ తీర్చి, తద్వారా మాయొక్క ఆశయాలనుకూడనూ వారికందించే నిమిత్తమై మేమీకాలేజిని స్థాపించాము. భాగవతమునందు, మీకుతెలిసినటువంటి విషయమే! కృష్ణుడు అనేక తుంటరితనములు చేస్తుండగా, గోపీగోపాలురందరూ యశోదవద్దకు వచ్చిఫిర్యాదులు చేస్తూవచ్చారు. కాన గోపాలునకు తగినబుద్ధులు చెప్పే నిమిత్తమై, యశోద అనేక విధములుగా ప్రయత్నం చేసింది. కానీ ఈవిధమైన బోధలు, కృష్ణుడికి ఏ రకంగాను నచ్చేవికావు. అతనికి ఇష్టమైనది వెన్న. దానిని తప్ప ఇక దేనిని కూడనూ తాను లక్ష్యం చేసే వాడుకాదు. కనుక కృష్ణుడిని పట్టేనిమిత్తమై ఈ యశోద ఒక చేతిలో వెన్న చూపిస్తూ, కృష్ణా రారా, రారా వెన్నతిందువురారా అని పిలుస్తూ, వెనక ఒక చేతిలో కర్రను పట్టుకునేది. వెన్నను చూపి కర్రచేత బుద్ధులు నేర్పేటువంటిది. ఈ నాడు ఈ విద్యాసమస్యయందు విద్య అనే వ్యామోహంలో మునిగిన విద్యార్థులను ఈ విద్యఅనే వెన్నను చూపి క్రమశిక్షణ అనే కర్రను వెనుకపెట్టి స్వామి, ఈ విధమైన తర్ఫీదు చేయడానికి కాలేజీని స్థాపించాడు. క్రమశిక్షణేలేకపోతే మానవజీవితము నిర్మూలపరిస్థితిలో పడిపోతుంది. మీలోచేరిన దుర్గుణములు, దురాలోచనలు, దుశ్చింతలు, దుర్భావములు అనే రోగ

ముయొక్క వివారణ నిమిత్తమై మాయొక్క హాస్టల్ యందుకానీ, కళాశాలయందుకానీ క్రమశిక్షణ అనే మందు నివ్వడానికి మేము ప్రయత్నం చేస్తాము. మీరు అయిష్టపడినా, విసుగుపడినా మేము వదలము. ఒక వేళ ఈ మందును మీరు ఇష్టపడక దీనిని విరమించుకుని వదలదలచితిరా, మీరేనష్టపోతారు. మీ జీవితమే పాడయిపోతుంది. నిజముగా మనము ఈ కాలేజీలో చేరినపుడు కానీ, ఇంకేవిధమైన పాఠశాలలో చేరినప్పుడుకానీ, సబ్జక్ట్‌ను ఎంత ప్రధానంగా విశ్వసిస్తున్నామో అన్ని సబ్జక్ట్స్ కంటే డిసిప్లిన్ అనే సబ్జక్ట్‌లో మంచి మార్కులు తెచ్చుకోవాలి. సత్యసాయి కళాశాలలో ప్రధానమైన సబ్జక్ట్ డిసిప్లిన్. ఏదోకొంతమంది ఇంగ్లీషు మీడియమ్, కన్నడమీడియమ్, తెలుగు మీడియమ్ ఫస్ట్ లాంగ్వేజీ, సెకండ్ లాంగ్వేజీ, థర్డ్ లాంగ్వేజీఅనిఅంటుంటారు కానీ మాకు ఫస్ట్‌మీడియమ్, ప్రధానమైన స్థానము ఒక్కడిసిప్లిన్‌దే! డిసిప్లిననేదేమనలైఫ్. దేహాన్నిచక్కగా అందచందములుగా తీర్చిదిద్ది పూర్వకాలములో భారతీయులు కట్టు బొట్టు జుట్టు అని, వారియొక్క డ్రస్సు కాళ్ళను నేలపైన పెట్టినడవాలి. తలపైన చక్కగా సన్ లైట్. విటమిన్స్ అంతా చక్కగా వస్తుంటాది. ఆసూర్యకిరణములన్నికూడను మనదేహంపైన చక్కగా ప్రసరించాలి. ఈ విధమైన దీనివల్ల ఆనాడు ఆయుః ప్రమాణాన్ని అభివృద్ధిగావించుకుంటూ వచ్చేవారు పూర్వీకులు. ఈ నాడు మనము ఒక సూర్యకిరణాన్ని కూడనూ నోచుకోలేనివారుగా ఉంటున్నాము. సూర్యుని యొక్క ఆకర్షణశక్తిని కొంతవరకు మనదేహములో ప్రసరించు కోలేని దుస్థితిలో ఉంటున్నాము. కాళ్ళకు బూటు, తొడలకుసూటు, చేతిలోకోటు, తలకు హేట్ (Hat). పాదమునుండి తలవరకూ కట్టేస్తున్నాము మనము. అంతెకాదు. ఉరి బిగించినట్లుగా పై బిగించుకుంటున్నాము. ఇదిఈనాడు భారతదేశంలో ఉన్నప్రోగ్రెస్.

కానీ మన జీవితము ఒక దీర్ఘమైన జీవితంగానూ, ఉపకారవంతజీవితంగాను, సామాజికజీవితంగాను అనుభవించుకునే దానికి మనం నోచుకో లేదు. భారత దేశాన్ని బ్రిటీష్‌వారు స్వీకరించడంచేత, భారతదేశంలో వారికి అనుకూలమైన ఉద్యోగములు చేసే ఇంగ్లీషు తెలిసినవారు లేకపోవడం చేత మన భారతీయులకు ఇంగ్లీషు నేర్పించి వారికి ఉద్యోగానికి అనుకూలమైన రీతిగా వారు తర్ఫీదు చేసుకుంటూ వచ్చారు. కనుకనే ఆనాడు వారిఉద్యోగుల నిమిత్తమైవిద్యను సృష్టించారు.

ఉద్యోగానికోసమని విద్యను సృష్టించిన నాటిపరిస్థితి నేడు విద్యకోసం ఉద్యోగాలను సృష్టించడంకోసం ప్రయత్నం చేస్తున్నారు. కనుకనే ఈ నాడు భారత దేశము నిరుద్యోగసమస్యలచేత కుమిలిపోతున్నది: మాడిపోతుందాది. ఏ ఆఫీసు దగ్గరకు వెళ్ళినప్పటికినీ ఉద్యోగాలనిమిత్తమై విద్యార్థులుబెగ్గర్స్‌మాదిరి ఉద్యోగం ఉద్యోగం అంటూ ఈ డిగ్రీ అనే పాత్రనుపట్టుకుని భిక్షమెత్తుకుంటూవస్తున్నారు.

విద్యార్థులారా, పవిత్రహృదయము కలవారా, ప్రేమ స్వరూపులారా, నిజముగా మనకళాశాలయొక్క విద్యార్థులు తమకాళ్ళపైనతామునిల్చి తమ తల్లితండ్రులకు సహాయకారులుగా ఉంటుండి, శ్రమించి పనిచేసి అది కోత్పత్తి కలిగించి, దేశానికి ఆదర్శజీవితాన్ని అందించడానికి ప్రయత్నించాలి.

శ్రీవారి దివ్యబోధ —బృందావనం 19-7-79.

# విగ్రహారాధన

భగవంతుడు సర్వవ్యాపకుడైననూ, వ్యక్తిగత ముగా, అర్చనద్వారా ఆరాధనాకర్మలద్వారా మానవులు ఆతనినిచేరేనిమిత్తమై ప్రయత్నింతురు. కొన్ని తెగలవారు భగవంతుడు ఒకగుడిలోపల ఉంటాడా, రాయి, కాయితములో ఉంటాడా అని వాదిస్తారు; ఇది సరి కాదు. అర్చన, పూజ, భజనలవలన భగవంతుని పొందుటకు వీలున్నది.

పూజ నిజముగా ప్రథమసోపానము. ఆహార నిద్రలను మాని, అరణ్యమధ్యమందు తపస్సాచరించి, దాని ఫలితముగా భగవదనుగ్రహమును పొందిన వారు చాలమంది యున్నారు. అయితే, పూజ, అర్చన, భజన, మొదలగు ఆరాధనా మార్గము సులభమైన మార్గము. మీరాబాయి, సక్కూబాయి, సూరదాస్ కబీర్ దాస్, శంకరాచార్య మొదలగువారందరూ, ఈ మార్గమునే అనుసరించి పరతత్వమును అనుభవించి ఆనందించిరి. ఇదంతా నిరుపయోగమైనపని. దానికి వినియోగించే కాలము వ్యర్థము; అనేవాదము సరి అయితే, వీరందరూ సర్వవ్యాపకమైన భగవత్ తత్వమును ఏదో ఒక రూపమందు ప్రత్యక్షముగా ఎట్లు చూడగలిగారు?

అర్చన, పూజ, జపము, లేక ఇది సాధ్యము కాదు. ఇంగ్లీష్‌భాషలోని అన్ని గ్రంథములలోను కనబడేవి 26 అక్షరాలే. ఆ అక్షరాలను నేరువకుండా, ఒకరిని ఎట్లు విద్యావంతుడనేది? అర్చనచేసే విగ్రహము కానీ, చిత్రముకానీ. దైవముయొక్క చిహ్నము మాత్రమే. దైవమును రాయిగా కాయితముగా మార్చరాదు. సర్వవ్యాపకుడైన భగవంతుని హిందువులు ఏదో ఒక విగ్రహరూపములో చూస్తారంటే, హాస్యాస్పదముగా ఉన్నదని అళ్వార్ మహారాజు, స్వామి వివేకానంద ఎదుట వాదించినాడు. వివేకానంద దాన్ని విని ఫక్కున నవ్వాడు. మంత్రిని పిలచి, గోడపైనుండిన ఆమహారాజుయొక్క పెద్ద చిత్రమును క్రిందికి తీయించి, ''మంత్రీ! ఆ చిత్రముపై ఉమ్మి వేయుము. అది నీకు మహారాజు కాదు కదా క్యాన్‌వాసు, కలర్, కదా; దానిలో ఇంకేమున్నది'' అన్నారు; స్వామివారు. మంత్రిగారు భయపడి భక్తివిశ్వాసములతో దానిముందు అంజలి బద్ధుడై నిలిచాడు, అంతే; ఆచిత్రపటము మహారాజువలె ఆదరణీయమే, అని అందరూ వివేకానందకు తెలిపిరి. భగవంతుడు సర్వత్రఉండినప్పటికినీ విగ్రహములను ఆధారముచేసికొని, ఆధేయమును ప్రత్యక్షముగా దర్శిస్తాము.

ఆధారమైన రూపమును పూజించి, ఆరాధించి, శాస్త్రరీతిగా షోడశోపచారములతో ప్రత్యక్షస్వరూపముగా భావించితే, తప్పక చిత్తశుద్ధికలిగి అంతఃకరణములో స్పష్టముగా భగవంతుడు ప్రతిబింబిస్తాడు. అట్లుకాక, అది కాయితము అని భావించిన, ఫలితముకూడ అంతే!

మానవుడు చిత్తశుద్ధికి తగిన కృషిచేయవలెను. మలినపాత్రయందు మంచి పదార్థము పాకముచేసినపుడు అది దుర్వినియోగమగును. మంచివిత్తనము సారహీనమైన భూమిలో పెట్టితే, లాభములేదు. చిత్తశుద్ధి లేని పూజ వ్యర్థము, అయితే, విశ్వాసము ప్రేమతోకూడిన చిన్న పూజావిధానమననుసరించిన ఫలితంఎక్కువ. ఒక గుమస్తానుగాని కలెక్టర్‌నుగాని నియమించేముందు వారి అర్హతానుభవములను పరీక్షిస్తాము. అటులనే భగవత్సాక్షాత్కారమునకు చిత్తశుద్ధి అను అర్హత తప్పనిసరిగా వుండేతీరాలి. తిరుత్తొండర్ అనే ఆళ్వార్ చిత్తశుద్ధి కోసమే తాను విగ్రహారాధన చేపట్టినట్టు వెల్లడించియున్నాడు. విగ్రహారాధన చేయునపుడు భగవంతునిరూపమును దర్శించాలి. కానీ, ఆ విగ్రహము రాతితో చేయబడినదా; లేక కొయ్యతో చేయబడినదా! అని విచారణ చేయకూడదు.

రూపమును వదలి వస్తువు; వస్తువులేని రూపము ఉండదు. రాతిపై దృష్టినిలిపిన దైవముకనబడదు: దైవముపైదృష్టినిలిపిన రాయికనబడదు.

భారతీయులు దైవమును రాతిగా కాయితముగా ఆరాధించుటలేదు. వారిభావము ఈ రాయికూడ దైవమే, అనునదే; ఈ తత్త్వమును, ఇట్టి సత్యమును, గుర్తించి సర్వవ్యాపకమైన దివ్యత్వమును దక్షిణేశ్వర కాళీ విగ్రహమందు సాక్షాత్కరింప చేసికొనుటకు, రామకృష్ణ పరమహంస పూనుకొన్నాడు.

ముఖ్యముగా, చిత్తశుద్ధి సంపాదించుటకు, కాలమును వ్యర్థముచేయక, సత్సంగము, సచ్చింతన, సద్భావము లందే గడపాలి. నిజముగా సత్కర్మలను చేయుట యందే ఆనందముగలదు. గీతను బోధించినపుడు, కృష్ణుడు అర్జునుని ''కురునందన'' అనే పేరుతో పిలుస్తాడు. కురు ''అంటే పనిచేయుము.'' ''నందన'' అంటే, ఆనందపడేవాడు'' కురునందనఅంటే, పని చేయుటలోనే ఆనందముననుభవించువాడు; పనిలేక పోతే, దుఃఖించువాడు, అని అర్థము. మీకు ఆది వారము వచ్చినదిఅంటే, ఆనందము. అయితే, అది HOLIDAY కాదు, HOLY DAY! నిర్మలచిత్తము కలిగిన భక్తుల పేర్లు స్మరించిన మాత్ర మున పంచభూతములూ వశమగును. పిడుగు నివారించే కొరకు అర్జునుని పదిపేరులను స్మరించేది రూఢి. దానికే త్యాగరాజు, కబీర్ మొదలైన భక్తుల ఆరాధిన చేసిన, భగవంతునికి ప్రీతి. చిత్తశుద్ధితో హృదయ పూర్వకముగా శరణాగతికి పూనుకోవాలి. అపుడే, వాడు నిజమైన భక్తుడు. అద్దముముందు నిలిచికొని, మూడువ్రేళ్ళను చూపిస్తే, దానిలోపలనుంచి మూడు వ్రేళ్ళు నీకు కనుపించును. అటులనే భగవంతునకు మన సర్వస్వమును అర్పించిన భగవంతుడుకూడ, మన యోగక్షేమములను తానే వహిస్తాడు.

శ్రీవారి దివ్యబోధ —బృందావనము 6-2-1979

## పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుతమూర్తి—(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం—అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2 | ఆత్మారామం | 5-00 | 0-45 |
| 3. | అధ్యాత్మికదీపిక | 2-50 | 0-20 |
| 4. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 5. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 6. | ధ్యానవాహిని | 1-50 | 0-15 |
| 7. | ప్రేమవాహిని | 1-00 | 0-15 |
| 8. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 9. | భజనావళి | 2-00 | 0-20 |
| 10. | మణిమాల | 2-00 | 0-20 |
| 11. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-35 |
| 12. | సత్యం శివం సుందరం(3) | 5-00 | 0-35 |
| 13. | సందేహనివారిణి | 2-00 | 0-20 |
| 14. | సూక్తిరసతరంగిణి (ఉప్పాల రాజారావు) | 2-00 | 0-25 |
| 15. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాల రాజారావు) | 3-00 | 0-35 |
| 16 | శ్రీ సత్య సాయీశ్వర నుతితరంగిణి (2) (ఉప్పాల రాజారావు) | 2-00 | 0-25 |
| 17. | సువర్ణసుమమాల | 5-00 | 0-30 |
| 18. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |
| 19. | శ్రీ సత్యసాయిదివ్యబోధ | 2-00 | 0-20 |
| 20. | శ్రీ సత్యసాయివచనామృతము3) | 2-00 | 0-20 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు—67, బృందావనములోని వ్రజ్ బృందావన్ ప్రెస్ నందు పి. చంకకోటిచే ముద్రింప బడి, యన్. కస్తూరిచే. "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయం, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయం,

పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

(1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ చందాలు స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 .రూ |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏభాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రస్సు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామ గల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134. యొక్క చిరునామాకే పంపవల [illegible] పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా [illegible]ను.

[illegible] చూచి [illegible] టలో చూడండి)

Regd. No. KRNU—83 FEBRUARY 1980

బృహత్ గ్రంథములను మీరు చదివి బోధపరచుకొనలేక పోయినచో, పిపీలికాది బ్రహ్మపర్యంతము, కీటకమునుండి కాంతివంతమగు తారాసమూదాయము వరకు, మానవుని శరీరములోని రక్తప్రసరణమండలమునుండి, సూర్య కేంద్రముగా పరిభ్రమించు గ్రహమండలమువరకు గల భగవత్ సృష్టిలోని వైచిత్ర్యము సౌందర్యములను గూర్చి ధ్యానించుడు. విశ్వమంతట నిండియున్నట్టియు, విశ్వాతీతమైనట్టియు భగవంతుని యేకాగ్రచిత్తముతో మనన మొనర్చినచో ఆ మహత్తరజ్యోతి మీమనస్సు నాక్రమించి మీరెన్నటికిని సంకుచిత మనస్కులు కానేరకుండునట్లుగా చేయును. మీ చేతలు, మాటలు భగవత్ చైతన్యమయములై యుండును.

Regd. with Registar of Newspapers No. RN/10772/64